శ్రీ ర స్తు

పరమహంసాయధీమహి



# వివర్తవాద వివేకము

"కారణం పరమం సత్యం - కార్యం వై వ్యావహారికం"

"విశ్వం బ్రహ్మాఽభిన్నం - అధిష్ఠానా నతిరిక్త స్వభావాత్"

అను సిద్ధాంతముల వివరణ

**The Theory of illusions and appearences**
**A critique**



'చిత్రకళాతపస్వి'

Dr. L. విజయగోపాలరావు L.I M. (Madras)

R.L. Peta, TENALI - 522 201 (A. P.)

మూల్యము రు. 10-00

This book is published with the financial assistance of Tirumala Tirupati Devastanams under their scheme "Aid to publish religious Books".

మణి మాణిక్య గ్రంథమాల : 4 వ మణి

సర్వహక్కులు గ్రంథకర్తవి

మొదటి ముద్రణ : 31 జులై 1986

ప్రతులు : 1000

మూల్యము : రు. 10/-

రచయిత యొక్క ఇతర గ్రంథములు :

1. స్వీయ మాన సోల్లాసము : (శ్రీ దక్షిణామూర్తి స్తోత్రవ్యాఖ్య)
2. విజయగోపాలము : (గీతయందలి అంతరంగిక బోధల వివరణ)
3. ద్వాదశ మణి మంజరి : (తత్త్వ శాస్త్రమున కథావస్తువులు 12)
4. ఆత్మతత్త్వ వివేకము : (అముద్రితము)

ముద్రణ : ప్రశాంతి ప్రింటర్స్, తెనాలి.

ప్రతులకు : డా॥ L. V. గోపాలరావు
రామలింగేశ్వరపేట,
తెనాలి, (A.P.) 522 201.

## వివర్తవాదమున ప్రమాణ ప్రవచనములు

### ఆత్మాశ్రయములు (Subjective aspect)

1. విశ్వం బ్రహ్మాఽభిన్నం అధిష్ఠానా నతిరిక్త స్వభావాత్ ॥
2. వివృతం బ్రహ్మజగద్రూపేణ ఇతి వివర్తః ॥
3. పూర్వరూపాఽ పరిత్యాగేన
   అసత్యనానా ప్రకార ప్రతిపత్తిభాసః వివర్తః ॥

### వస్త్వాశ్రయములు (Objective aspect)

1. వివర్తోనామ విషమసత్తాక కార్యాపత్తిః ॥
2. నవనవోన్మేషశాలినీ ప్రతిభ వివర్తం ॥
3. జీవాశ్రిత మాయావిషయీకృతం బ్రహ్మ
   స్వతయేవజాడ్యాశ్రయ ప్రపంచాకారేణ
   వివర్తమానతయా । ఉపాదానమిత్యాహుః ॥

గమనిక : భామతీ ప్రస్థానములో అవిద్య, జీవాశ్రితమని చెప్పబడి యుండ, వివరణ ప్రస్థానములో అవిద్యకు బ్రహ్మయే ఆశ్రయమని—

"ఆశ్రయత్వ విషయత్వభాగినీ నిర్విశేష
చితిరేవ కేవలా" అని సంక్షేపశారీరకమునందు పేర్కొనబడి యున్నది. ఈ జీవాశ్రయ బ్రహ్మాశ్రయ భావములు రెండును అద్వైత సిద్ధాంతాఽనుయోగికములే.

'దర్శనాచార్య,' 'కళాప్రపూర్ణ'
డా॥ కొండూరు వీరరాఘవాచార్యులుగారి,

# మున్నుడి



**వివర్తదృష్టి :**

వివర్త శబ్దమును, దిగువ నుదాహరించు దాని వ్యుత్పత్తులబట్టి పర్యాలోచించి చూతము. "విశేషేణ వర్తతే ఇతి వివర్తః" విశేషముగా వర్తించుదానికి వివర్తమని పేరు. ఏ వస్తువైనా ఉన్నది ఉన్నట్లుగా దాని స్వరూపముతోనే కనబడటం, లేదా అనుభూతము కావడము సామాన్యమే. అందులో విశేషమేమీ లేదు. కాని, ఉన్నవస్తువు తనకుగల స్వరూపముతో గాక ఇంకొక రూపముతో కనబడటమే, తోచడమే, విశేషమంటే! బంగారమున్నదనుకోండి. అది బంగారంగా ఉండడం సామాన్యమే. అందులో విశేషమేమీ లేదు. ఆ బంగారమే ఒక నగ ఆకారాన్ని తాల్చి ఒకనామాన్ని పొంది కనబడటమే విశేష మవుతుంది. అప్పుడు దాన్ని కంకణమనో, ఉంగరమనో, కుండలమనో అంటారు కాని, బంగారమని అనరు. ఈ దృష్టితో చూచినప్పుడు బ్రహ్మపదార్థ మనేది సచ్చిదానంద స్వరూపంగా కనబడితే, అది సామాన్యమే అవుతుంది కాని, అందులో విశేషమేమీ లేదు. అలాకాక, అది ప్రకృతి మహదాది పరిణామ రూపమైన జగత్తుగా కనబడటమే విశేషమంటే. ఇప్పుడు చూడండి — సచ్చిదానందాఖండ పరబ్రహ్మం తన సామాన్య స్థితినుండి ప్రకృత్యాద్యాకార పరిణత జగత్తనే విశేషంగా రూపొందింది. కావున అప్పుడు దాన్ని వివర్తం అనవలసి వచ్చింది. అంటే సారాంశ మేమిటన్నమాట? సచ్చిదానంద

బ్రహ్మము నామరూపాత్మక జగతుగా రూపుతాల్చి తోచిందని అర్థం. ఇందులో మొట్టమొదటిది సామాన్యస్థితి కాగా, రెండవది విశేషస్థితి. రెంటి యందు కూడా పూర్వరూప పరిత్యాగం లేనేలేదు. బంగారం బంగారంగా ఉన్నప్పుడూ సామాన్యమైన బంగారమే. అలాకాక భూషణంగా విశేషాకారాన్ని పొందినప్పుడూ బంగారమే. అయితే భూషణం కాగానే దాన్ని బంగారం అనరు, నగయే అంటారు. తత్త్వం తెలిసినవాడు మాత్రమే, ఇది నగ అయినా బంగారమే అను కొంటాడు. తక్కిన వారందరు ఈ నగను ధరించి అందంగా కులుకుదామనే అనుకుంటారు.

బ్రహ్మమును జగత్తుగా చూచేవారంతా ఇలాంటి అలంకార ప్రియులన్నమాటే. మూలద్రవ్య స్వరూపాన్ని పఱింగిన ఏఒక్కడోకాని, తత్త్వజ్ఞుడు కాడు. ఈ సందర్భంలో 'కనక కుండలోపమానం' పనిచేసినట్లు రజ్జు సర్పోదాహరణం ఉపయోగించదు. రజ్జుసర్పోదాహరణంలో ద్రష్టకు రజ్జు జ్ఞానం కలుగగానే సర్పం నశిస్తుంది. కనక కుండలోదాహరణలో, కనక జ్ఞానం కలిగినా, కుండల స్వరూపంగాని కుండల జ్ఞానంగాని నశించే పని లేదు. సాధకునికి జగత్తును చూచునప్పుడు ఇది బ్రహ్మమే అనే జ్ఞానం కలిగినా—ఈ జగత్తు కాని, జగద్వ్యవహారములుగాని నశించవలసిన పని లేదు. అది అలా కొనసాగి పోతూనే ఉంటుంది. ద్రష్టయొక్క దృష్టిలో మార్పువచ్చి వాడు జగత్తును జగత్ వ్యవహారాన్ని బ్రహ్మముగానే దర్శించగలిగి అఖండ బ్రహ్మభావంతో కృతార్థుడు కాగలుగుతాడు. ఇదీ—నేను అనుభూతి పొందిన వివర్తదృష్టి. ఇప్పుడు మనం చెప్పుకొన్న వివర్తావస్థలో పూర్వరూపపరిత్యాగం ఉన్నదా లేదా అనే విషయం అనుభూతిపరులకు మాత్రమే తెలుస్తుంది. కాని, అజ్ఞులకు తెలియదు. ఇప్పుడు 'బ్రహ్మసత్యం జగన్మిథ్య'కాదు; "బ్రహ్మ సత్యం జగద్బ్రహ్మ" అవుతుంది. ఇదీ—వివర్తదృష్టి అంటే. అందుకే దీన్ని వాదమని నేను అనదలచలేదు. ఇది జిజ్ఞాసువులకు కలుగవలసిన ఒక విశిష్టమైన సత్యదృష్టి, లేదా పార

మార్థిక దృష్టి. ఈ విషయములను అనేకోపమానాలతో తీసుకోవచ్చును. నీరు—ఆవర్త బుద్బుద తరంగాలు; ఇనుము—భిన్నభిన్న ఆయుధాలు; మట్టి-మూకుడు. బాన, కుండ మొదలైనవి. వీటన్నిటిలో కూడా కారణవస్తువుకు పూర్వరూప పరిత్యాగం లేదు అందుకే ఛాందోగ్యం "వాచారంభణం నామధేయం వికారో మృత్తికేత్యేవ సత్యమ్" అన్నది.

వివర్త శబ్దానికి మరో వ్యుత్పత్తి "విపరీతేన వర్తత ఇతి వివర్తః" అని. జగత్కారణబ్రహ్మం సత్తు, చిత్తు, ఆనందమే స్వరూపముగా కలిగినట్టిదని చెప్పుకొన్నాముకదా! ఆ సచ్చిదానందములకు విపరీతమైన లక్షణాలు అసత్తు, జడము, దుఃఖము అనేవేకాదా! పర్యాలోచించి చూచితే, జగత్తు అసజ్జడ దుఃఖాత్మకమని అందరికీ తెలిసినసత్యమే. సచ్చిదానందాత్మక పరబ్రహ్మము, తనకు విపరీతమైన అసజ్జడ దుఃఖాత్మక జగత్తుగా తోస్తున్నది. అజ్ఞులకుగాని విజ్ఞులకుగాని ఈ అనుభవం ఉండనే ఉంటున్నది. కనుక రెండవ వ్యుత్పత్తినిబట్టి చూచినప్పటికీ బ్రహ్మస్వరూపానికీ జగత్తుకూ వరుసగా సచ్చిదానందములు, అసజ్జడదుఃఖములు సరిపడుతూనే ఉన్నవి. కనుక బ్రహ్మము జగద్రూపంగా వివర్త పరిణామ దృష్టినిబట్టి భాసించడంలో ఆ సంగతి ఏమీలేదు. అయితే జిజ్ఞాసువులకు తొలుత జగత్తునందు అసజ్జడదుఃఖాత్మకమనే దృష్టి కలిగినా, ఆ విపరీతబుద్ధి నశించి సచ్చిదానంద భావన దృఢపడవలసి యున్నది. దీన్నే గీతాకారుడు బ్రాహ్మీస్థితి అన్నాడు. తన తోడి సాధర్మ్యం కలగడానికి ఈ దృష్టి అత్యవసరమనే సంగతి గీతనిగూఢంగా సూచిస్తూనే వచ్చినది.

"ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి" అని

కొందరేమో జగత్తునందు మిథ్యాత్వదృష్టి కలగాలంటారు. కాని, అది అద్వైతమా అని కొందరి సందేహం. జగత్తునందు కనకకుండల

న్యాయానుసారం బ్రహ్మదృష్టి కలగడమే తారక మార్గమని అస్మదాదుల అనుభూతి చెప్పుతున్నది.

జిజ్ఞాసావస్థలో బ్రహ్మభానమనీ, బ్రహ్మ ప్రతిభానమనీ రెండుఉన్నాయి. బ్రహ్మభాన మంటే పరమాత్మ తత్త్వమే; అనగా సచ్చిదానంద స్థితి. బ్రహ్మ ప్రతిభానమంటే ప్రకృతి. లేక తత్పరిణామమైన జగత్తు అన్నమాట. ఈ రెండూ కూడ బ్రహ్మమును విడనాడిలేవు. రెండూ బ్రహ్మమునకు అభిన్నాలే అయి, బ్రహ్మ స్వరూపాలే అయి ప్రకాశిస్తున్నాయి. భానం ప్రతిభానమయ్యేప్పటికి ఉపాధివశాన మార్పు గోచరిస్తున్నది. నిజమాలోచిస్తే— అంటే, తాత్త్వికదృష్టితో చూస్తే భాన ప్రతిభానములకు భేదం ఉండదు. ఇది అనుభూతిలో తేలే సత్యం కాని, మాటలతో చెప్పేదీ, మనస్సుతో ఆలోచించేదీ కాదు. అందుకే పరమతత్వాన్ని అవాఙ్మానస గోచర మన్నవి కదా ఉపనిషత్తులు. సుజ్ఞానులు ఈ రహస్యాన్ని తెలుసుకొంటారు కనుక, వారు మోహ పడరు.

ఇలాంటి గహనమైన వివర్తదృష్టిని వివేచించడానికి ఈ గ్రంథములో డా॥ గోపాలరావుగారు పూనుకొన్నారు. వారు త్రిదోషాల నెరింగిన వైద్యులుకూడ కనుక వాటినిగూర్చి బాగా స్టడీచేసారు. అసలు ఉన్న వేదాంత తత్త్వమంతా వాటిపరిజ్ఞానాన్ని పొందితే సుస్పష్టమవుతుంది. తదతీతేతుడయి ముక్తుడే అని గీత అంటున్నది కదా! కనుక డాక్టరుగారు వివర్తదృష్టినివివరించడానికిఈ గ్రంథంలో చేసినపరిశ్రమ సఫల మయినదనవచ్చు.

జగన్మిథ్యావాదము ఎవ్వరికైనా ఆశ్చర్యము కలిగించునట్టిదే. ప్రత్యక్ష దృశ్యమగుచున్న జగమును లేదన్నచో ఎవ్వరును అంగీకరింపరు. ఈ అంశమును లెస్సగా వివరించి స్వీయాభిప్రాయమును తెల్పుటకు గ్రంథకర్త మంచి ప్రయత్నము చేసినారు. పాఠకులు 55-59 పుటలలో గల స్వీయ

స్వతంత్ర భావము చదివితీరవలయును. అరవిందులు జగన్మిథ్యావాదమును అంగీకరింపక దివ్యపరిణామ సిద్ధాంతమును ప్రచలిత మొనర్చినారు. గ్రంథ కర్త దానిని కూడ జీర్ణించుకొని ఉపసంహారములో స్వీయాభిప్రాయమున తెలిపిరి. బ్రహ్మము, జగత్తు నాణెముయొక్క బొమ్మ, బొరుసు వంటి వనుకొనుటఇప్పట్టునసమంజసము. ఏది ఎట్లయినను ఈగ్రంథమును జిజ్ఞాసు వులు చదివి గ్రంథకర్త కృషిని అవగతము చేసికొనవలసి యున్నది.

తెనాలి —ప్రత్నానంద

2-8-86

—o—

డా॥ వీరరాఘవాచార్యుల వారు సతీవియోగానంతరము ప్రత్నానంద నామమును ధరించినారు.

—గ్రంథకర్త



శ్రీః బ్రహ్మముక్త చైతన్యస్వరూపులు



# సద్గురుమూర్తి

దివ్యశ్రీ 'మున్నంగి పున్నయ్యపంతులు' గారికి

తమ శిష్యుడు అంతేవాసియునగు

విజయగోపాలుని భక్త్యాంజలి



లలిత సంగీత రికార్డిస్ట్,

రంగస్థల నటరత్నము.

ప్రసూతివైద్య శస్త్రవైద్య శేఖరుడు

తాత్త్వికగ్రంథ పంచక రచయిత

83 వసంతముల వన్నెచిన్నెల

కృ తి క ర్త

# శ్రీః కృతిగ్రహీత

పరిణత జ్ఞానవిజ్ఞాన ధనసంపన్నులు సాహిత్యస్వరాట్,
భారతీయ తత్త్వశాస్త్రవేత్త, దర్శనగ్రంథ
రచయితయునగు మహామనీషి



శ్రీ విద్యోపాసకులు

## శ్రీశ్రీ ఆచార్య పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

**M.A., M.Litt., Ph.D., D Litt , H.T.A.H.,**
**Retd. Prof. of Head of Dept. of English**
**University of Nagapur**
**Life member of Trinidad Academy of Hinduism**
**59, Vidya Vihar - NAGAPUR**

## శ్రీ గ్రంథ పరిష్కర్త



నాకు తెనాలిలో తత్త్వసాధనమున మార్గదర్శకులు, తత్త్వరహస్య
ప్రబోధకులునై గురుత్వమును వహించుచున్న కళాప్రపూర్ణులు,
పద్యనాచార్య బ్రహ్మశ్రీ కొండూరు వీరరాఘవాచార్యుల
(ప్రజ్ఞానందస్వామి) వారు, తెనాలి.

# పీఠిక

శ్రీకరమగు ఏ గ్రంథమునకైనను పీఠికతో శ్రీకారము పలుకుట యొక ఆచారము. మంగళకరమగు ఏ కార్యమునకైనను సుప్రారంభము దీపారాధనతో జరుపుటొక సంప్రదాయము. గ్రంథముల విషయమున గ్రంథకర్త తన దృక్పథములనుండి విశిష్టమగు విషయవివేకమును ప్రస్ఫుటించుటయే పీఠికకు ప్రయోజనము. ఈ పీఠికాదీపకళిక వెలుగున నా హృదయమును విప్పి వివర్తవాదవివేకమును వివరింప యత్నింతును. అనుమతించండి. గ్రంథము చివరి భాగములో నాస్వతంత్ర భావముల పొందుపరచితిని పరిశీలింపండి.

ఈ గ్రంథమున ప్రధాన కథావస్తువు వివర్తప్రక్రియ. జగత్తు కేవలం భ్రాంతి జ్ఞాన సంజనితమగు దృశ్యమే గాని అసలులేనట్టిదని కొందరు తాత్త్వికులు చెప్పుదురు. దీనినే ఆంగ్లమున the theory of illusion అని చెప్పుచున్నారు. మరికొందరు జగత్తు రాశి రూపమున (as mass with density) అనుభవమగుచున్నను. అది నిత్యసత్యమైయుండక పదార్థపరిణామ పూర్వకమగు మార్పుల జెందుచున్నందున (everchanging) మిథ్యయనియు చెప్పుచున్నారు. ఈ విషయముల విశ్లేషించి నిర్ధారించుటయే ఈ గ్రంథమునకు లక్ష్యము.

ఈ లక్ష్యసిద్ధికి నేనువివరింప సంకల్పించిన విషయములకు ప్రాతిపదిక :

శ్లో॥ సతత్త్వతోఽన్యథాప్రథా వికార ఇత్యుదీరితః
అతత్త్వతోఽన్యథాప్రథా వివర్త ఇత్యుదాహృతః॥
(వేదాన్తసార, సదానంద.)

తత్త్వసహితమగు జ్ఞానమును పరిణామ వాదమనియు తత్త్వరహిత

మగు, అనగా ఈ జగన్నిర్మాణమునకువలయు 24 తత్త్వములు మరియు జీవునితోచేరి 25 అగుతత్త్వములకు సంబంధింపకయే కేవలము మనస్సునందు ప్రాపించిన భ్రాంతిచే కలుగు దృశ్యము వివర్తమనియు ఈ శ్లోక భావము. ఇపుడు జగత్తు తత్త్వములతో కూడినట్టిదని కపిలసాంఖ్య కారికాదులు, శ్రీ యాజ్ఞవల్క్యప్రోక్త పైంగలోపనిషత్తు, సురేశ్వరాచార్య కృత పంచీకరణవార్తికము తెలుపుచున్నందున జగత్తునకు పరిణామ ప్రక్రియయే అనువర్తనీయమగు చున్నది. వివర్తమన్ననో వికారమునకు అనగా భ్రాంతికి సంబంధించినది. గనుక జీవభావముచే ప్రాప్తించిన ద్వంద్వానుభూతియే, వివర్తమనదగునని, తత్త్వముల వికారములకు సంబంధించినది గనుక జగత్తుకు పరిణామమనుపదమే వర్తించునని తెలియుచున్నది. నా చర్చలకు ఇదియే ప్రాతిపదిక. కాగా—

వైదికవాఙ్మయమును వర్గీకరించి చతుర్వేదముల రూపొందించిన మహాపురుషుడా వేదవ్యాసమహర్షి. అంతటి ప్రజ్ఞాశాలి రచనలు సకలతత్త్వశాస్త్రములకు ఆధారముకాగా ప్రతిభాశాలురైన మతకర్తలు తమతమ లౌకిక తార్కికశక్తులకు తమతమ జీవధర్మములకు (instincts) అనుగుణ్యముగ భాష్యముల వ్రాసియుండిరి. అందు శ్రీ శంకరుల భాష్యములు బహుజనాదరణీయములై శాంకరాద్వైతమను సిద్ధాంతమున్ను ప్రచారమునకువచ్చియున్నది. ఇట్టి అద్వయ బ్రహ్మవాదమును అవగాహనతో గ్రహించుటకు వివర్తభావవివేకమే ఏకైక సాధనము. దీనిని మన పరిశీలనకు ప్రధానముగ గ్రహించి ప్రగతిసాధించుదము.

వివర్తమనగా—అధిష్ఠానపదార్థమగు బ్రహ్మమునందు అవలేశమైనను మార్పుకలుగకయే అందు మరొక రూపములేని—రూపమువలె (స్వప్న పదార్థమువంటిది) ఈ జగత్తు గోచరించుటయే. అనగా మూర్తిమంతముగా

కున్న ఒక అన్యదృశ్యము గోచరించుటయే. This is due to the Super Imposition of an unsubstantial sham phenomenon ఈ దృశ్యముయొక్క సత్తయే విషమసత్త. ఇట్టిసత్తను ఆంగ్లమున 'ఇల్యూషన్' అందురు. అనగా భ్రాంతి జ్ఞానసంజనితమగు దృశ్యము. కాగా, జగత్తు, సాంద్రతగల రాశిరూపమున మనకు గోచరమగుచున్నది; we have been experiencing it as mass with density. అందుచే వివర్త ప్రక్రియ కేవలము మనస్సుకు సంబంధించినదై, వాసవమగు రాశిలేని స్వప్నదృశ్య రాశివంటిదా ? లేక వాస్తవముగ రాశియుండియు, అదితన అనిత్య స్వరూపమును మాత్రము (matter of a transitory nature) తెలుపు నట్టిదా ? అని నిర్ధారించి తెలిసికొనుట మన ప్రధమ కర్తవ్యము. ఇది మిక్కిలి వివాదస్పదమే గాక బహుప్రముఖమైన విషయముకూడ అయియున్నది. ఏలనన :—

'విశ్వంబ్రహ్మాభిన్నమేవ స్వయంభవతుమర్హతి'।

'బ్రహ్మకు జగత్తుఅభిన్నం'—కానీ,

'జగత్తుకు బ్రహ్మపూర్తిగా భిన్నమే'

అను అనుయోగి, ప్రతియోగి, సూక్తుల విషయమునగల సమరస భావమును (Conducive and antagonistic statements) గుర్తించ గలవారికి మాత్రమే వివర్తవిధానమును అవగాహన జేసికొను సామర్థ్యముపలబ్ధమగును. ఇది ఐన్‌స్టీన్ మహాశయుని సాపేక్షిక సిద్ధాంతమంతటి సునిశిత భావగర్భితమగు మహత్తర విషయము. ఇంతలి అంతరంగిక భావమెట్టిదన — బ్రహ్మయొక్క దృష్టికి అనగా ఆత్మాశ్రయ దృష్టికి (Subjective View) జగత్తు ఆయనకు అభిన్నము మాత్రమేగాక అనన్యమనికూడ సిద్ధించుచున్నది. కాగా, జీవదృష్టికి మాత్రము (అజ్ఞాన

దృష్టికి) జగత్తు బ్రహ్మకు భిన్నమైనట్టిదిగనే తెలియబడును కనుక జగత్తు పుట్టుటకు కారణము అజ్ఞానమని చెప్పబడియున్నను, పుట్టి, రూపొందినట్లు భాసించు జగత్తు బ్రహ్మయేనని తెలిసికొనలేకపోవుటయే అజ్ఞానమని సుస్పష్టమగుచున్నది. ఇట్టి అజ్ఞానము తొలగినవారికే 'జీవో బ్రహ్మైవనా పరః' అను అనుభూతి ప్రాప్తించుట. అదియే నివృత్తి. ఇట్టి నివృత్తి పొందనివారికి 'మాయ సత్యం - జగత్తు నిత్యం' అను సూక్తియే అనుభూతినిచ్చును. ఇదియే వివర్తవాదమనబడు మాయావాదమునకు మూల సిద్ధాంతము. ఇదియే రాజగుహ్యమగు బ్రహ్మవిద్య. దీనిని గీతయందు కృష్ణభగవానుడిట్లుటంకించి యున్నాడు :-

శ్లో॥ మయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా
మత్‌స్థాని సర్వభూతాని నచాహంతేష్వవస్థితః ॥ (గీ 9-4)

శ్లో॥ నచమత్‌స్థాని భూతానిపశ్యమే యోగమైశ్వరమ్ ।
భూతభృన్నచభూతస్థో మమాత్మాభూతభావనః ॥ (గీ 9-5)

తాత్పర్యము : పరిదృశ్యమానమగుచున్న ఈ జగత్తు సర్వమున్ను అవాఙ్మానస గోచరమగు పరమాత్మ భావముచేత వ్యాపింపబడియున్నది. కాగా, ఈ జగత్తునందలి సర్వభూతములును నాయొక్క స్వరూపముచేతనే తమ తమ భావముల (రూపముల) పొందినవి గనుక నాయందున్నవని చెప్పబడుచున్నవి. కానీ, నేనుమాత్రము ఆ భూతములయందుండువాడనుగాను. అనగా సర్వభూతములకు నేనే అధిష్ఠానమునగుచున్నాను. అందుచే ఆ భూతజాలమును అజ్ఞానులు (సత్యవస్తుస్వరూపజ్ఞానము లేనివారు) నాయందు ఆరోపించి తెలుపుటయే వివర్తభావమునకు ప్రాతిపదిక. అందుచే ఓ విజయుడా ! నా ఐశ్వర్యమెట్టిదో అనగా ఈశ్వర సంబంధమగు విభూతి ఎట్టిదో అవగాహన జేసికొనుము. భూతముల ఉత్పత్తిస్థితులద్వారా తెలిసి

కొనబడు నా స్వరూపము ఆ భూతముల ధరించినట్టిదిగాని, ఆ భూతముల యందున్నట్టిదిగానికాదు. ఎట్లన రజ్జుసర్పవిషయమున సర్పముయొక్క ఉత్పత్తిస్థితులకు కారణభూతమగు రజ్జువు అధిష్ఠానమైయున్నను, సర్పముగ భావన చేయబడుచున్నను, ఆ సర్పమునకు ఆ రజ్జువు ఆధారముగాని, ఆధేయముగాని ఎట్లు కాబడదో అట్లే భూతముల ఉత్పత్తిస్థితులకు కారణ మగుచున్న పరమాత్మయు, ఆకాశముతోనెట్టి సంబంధము లేకయే వాయువు ఆకాశమందంతటను నిండియున్నట్లు ఆ భూతజాలమునకు ఆధారముగాని ఆధేయముగాని కానేకాదు. ఈ విషయమున గీతోపదేశమును అవగాహనకు దెచ్చుకొననగును.

శ్లో॥ ఏచైవసాత్వికాభావా రాజసాస్తామసాశ్చయే ।
మత్తఏవేతితాన్విద్ధినత్వహంతేషుమయి ॥ (గీ. 7-12)

శ్లో॥ త్రిభిర్గుణమయైర్భావై రేభిసర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్
(గీ. 7-13)

భావములు : 1. సత్వరజస్తమస్సులకు సంబంధించిన భావములు (పదార్థ ములు) ఏవి కలవో (the meterial entities) అవియన్నియు నా వలననే పుట్టినవని తెలిసికొనుము. కానీ, నేను వానియందెంతమాత్రమును లేను. అనగా అట్టి పదార్థములు తనకు ఎంతమాత్రమును ఆశ్రయములు గావు.

2. సాత్వికరాజస తామసభేదములచే రాగద్వేషమోహాది రీతులతో ప్రకా శించు నాస్వరూపమును మాత్రము తెలియజాలకున్నారు. పరాప్రకృతి సంయోగము వలన రజ్జుసర్పములవలే వెలువడుచున్న సకల భూతములును

శబ్దాదివిషయములయందలి రాగద్వేషమోహాదులచే ఆవరింపబడి విషయ వాంఛయందాసక్తి పెరిగినందున స్వస్వరూపమును తెలిసికొనలేకున్నా రనియే తాత్పర్యము. ఇట్లు ఆత్మభావ భూతభావముల నిజస్థితిని గ్రహించిన గాని వివర్తభావము విశదమునాదు. ఇది ద్వివిధనిష్ఠలలో జ్ఞాననిష్ఠకు సంబంధించినది.

బ్రహ్మసూత్రములకు శ్రీ శాఙ్కరభాష్యదృక్కోణము ననుసరించి ప్రతి అధికరణమునందును పడుగుపేకలతో నేయబడినట్లు అంతర్లీనమై యున్నదీ వివర్తభావము. ఇట్టి వివర్తభావము ప్రతిపాదింపబడియుండక పోయిన పక్షమున అసలు దృక్‌దృశ్యములనబడునవిగాని (the subjective and objective aspects or conecpts) ప్రమాణము ప్రమేయము లనబడునవిగాని కర్తభోక్తలనబడు భావములుగాని స్ఫూర్తినిచ్చుటకే అవ కాశముండెడిదిగాదు, మరియు స్పందన, చలనము సృష్టిఅనబడు భావము లుండెడివిగావుఅని తన అధ్యాస భాష్యమునందు శంకరులు వ్రాసిన ఉపోద్ఘాతమునందే ఉటంకించియుండిరి. అధి + ఆస=అధ్యాస— Super imposition అనబడునది వివర్తభావమునే తెలుపుచున్నది. ఒక మూల పదార్థమునందు మరొక వికారపదార్థరూపము భాసించుటే అధ్యాస పదమునకు అర్థము. వికారమన—ఒక వస్తువునందు గుణపరిణామము ప్రాప్తించి నందున, తన రూపురేఖలయందును స్వభావ ప్రభావములయందును మార్పు పొందుటనియేగానీ వికృతరూపమని అర్థముగాదు దీనినే కార్యము లేక (byproduct) అందురు. అధ్యాసప్రక్రియానుసారము ఈ వికారము-చూచు వానికి మాత్రమే భాసించునుగాని, మూలపదార్థమగు అధిష్ఠానమునందు మాత్రము లేశమైనను మార్పుకలుగకుండుటయే గుర్తించుకొనవలసిన విషయము. కనుక అధ్యాస, అధ్యారోపము, వివర్తము అనుపదములు పర్యాయములు మాత్రమేగాని భిన్నములుగావు. అధ్యాసభాష్యారంభమునందే శంకరులు :—

"తమేతం అవిద్యాఖ్యం. ఆత్మానాత్మనోరితరేతరాధ్యాసం పురస్కృత్య సర్వే ప్రమాణ ప్రమేయ వ్యవహారాః లౌకికా వైదికాశ్చ ప్రవృత్తాః సర్వాణిచ శాస్త్రాణి విధిప్రతిషేధమోక్ష పరాణి" అని పేర్కొనెను.

భావము : ఆత్మ అనాత్మల ఇతరేతరాధ్యాసమును పురస్కరించుకొనియే లౌకికములు వైదికములు అయిన సర్వవ్యవహారములును ప్రవర్తించు చున్నవి. విధిప్రతిషేధములైన ధర్మశాస్త్రములును, మోక్షకారకమైన వేదాన్త శాస్త్రమును వ్యవహారమునకు వచ్చినవి. ఇట్టి వివర్తవాదము బ్రహ్మ సూత్రములయందు సర్వత్ర ప్రతిపాదింపబడియున్నను ఆరంభణాధికరణము నందు మాత్రము ప్రత్యేక దృష్టిలో విపులీకరింపబడియుంట గమనించి అవగాహనకు యత్నించుటయే కర్తవ్యము. ప్రయోజనకారియునగును, నిదిధ్యాసముచేయగలరు.

I ఆవశ్యకపంచకమను శీర్షికతో కొన్ని సాంకేతిక విషయములు ఈ గ్రంథ ఆరంభమునందు పొందుపరచబడియున్నవి. ఇవి కొంత ప్రాథమిక జ్ఞానము సమకూర్చగలవైనను ప్రారంభకుల అభిరుచికి అనువుగ నుండవు. వీటి విషయమున శ్రమించినవారికి తరువాతవచ్చు విషయముల యందు అవగాహన ఆసక్తియు అతిశయింపగలవనుట తథ్యము.

II విషయముల పునరుక్తి సాధకులకు సహరించుననియే ఉద్దేశ పూర్వకముగనే ప్రవేశపెట్టబడినది. నమస్తే!

భవదీయ

— విజయగోపాలుడు

# కృతి — సుకృతులు



1. శ్రీ జ్యోస్యుల శివకామేశ్వరరావుగారు, తెనాలి. వారి జనకులు
   కీ. శే. సూర్యనారాయణగారి స్మారక విరాళము 116-00

2. శ్రీ మాదిరాజు సుందరలక్ష్మిగారు, 'ఉభయభాషాప్రవీణ'
   గూడూరు, నెల్లూరు జిల్లా. 116-00

3. శ్రీ తాడేపల్లి పేరయ్యశాస్త్రిగారు, ఎడ్వకేట్, తెనాలి.
   తమ మేనమామ కీ.శే పిల్లలమర్రి సత్యనారాయణగారి
   స్మారక విరాళము 50-00

4. శ్రీ చివుకుల రాధాకృష్ణమూర్తిగారు, తెనాలి.
   Dy. Supt. (Retd) Jails Deptmt. 50-00

5. కీ. శే. ఎర్మారెడ్డి రామిరెడ్డిగారి ధర్మపత్ని
   నరసమ్మగారు, కరీంనగర్. 25-00

6. శ్రీ దొగ్గలి వేంకటయ్యగారు, జిల్లాపరిషత్, కరీంనగర్. 25-00



# డాక్టరుగారు - వివర్త వివేకము



"జననాంతరంలో చేసిన భగవత్సాధన, ఏ ప్రతిబంధం కారణంగానో వ్యాహతమయితే మళ్లీ తదుత్తరజన్మలో దానికి సూత్రపాతం జరుగుతుంది", అన్న తాత్త్వికోపదేశం, గీతోపదేశమని అందరూ ఎరిగినదే. ఈ ఆభాణకానికి డాక్టరుగారి వేదాంతజీవితం ఉదాహరణంగా కనబడుతున్నది. లేకుంటే ఈ వివర్తవాద వివేకం తద్వివరచనం సంభావ్యము కాదేమో!

వారు మావూరునందు మెడికల్ ఆఫీసర్‌గా పనిచేశారు. ఇది దాదాపు ఏబది ఏళ్ళనాటి మాట. నాటికి నేడు పునర్దర్శనం పునఃపరిచయం. ఆయన మొదట రంగస్థలనటుడు. స్వర్ణపతక సన్మానపత్ర విజేత. పిమ్మట వైద్యావతంసుడు ప్రసూతి వైద్యనిపుణుడు. మరి ఇప్పుడో తాత్త్వికుడు. అద్వైత వేదాంతం వారికి నేడు ప్రాణాధికమైన ఏకైక గమ్యం. వారిలో వచ్చిన ఈ దశాంతర పరివర్తనం నన్ను చకితుణ్ణి చేశింది. ఆయన ఏటికి ఎదురీదే స్వభావంగల వ్యక్తిగా నాకు జ్ఞాపకం వచ్చినది. సమాధానం లభించింది. సాహస ప్రవృత్తి వారివిలక్షణ లక్షణం. గురుముఖాధ్యయనం నోచని జీవితం. శ్రీ రావుగారి వ్యుత్పత్తి దొడ్డది. వ్యవసాయాత్మక కృషితో ఆంగ్లంలో ఆంధ్రంలో వెలసిన భారతీయ పాశ్చాత్య తత్త్వశాస్త్రగ్రంథాలను అనుశీలనంచేశి స్వతంత్రభావములతో రచనలు వెలయించడం కొండనెక్కు యత్నం వంటిదే అయినా, 1. స్వీయమాన సోల్లాసమను శ్రీ దక్షిణామూర్తి స్తోత్రవ్యాఖ్య 2. విజయగోపాలం 3. ద్వాదశ మణి మంజరి 4. ఆత్మతత్త్వ వివేకము వంటి ఉత్తమోదాత్త రచనలు వారి భావనకు మనన చింతనలకు ప్రతిబింబములే. మరి ఇప్పుడు వివర్తవాద వివేకం శ్రీ డాక్టరుగారి వైదుష్యానికి పరాకాష్ఠ. వారి తత్త్వ మథనానికి నికషోపలం. స్వయంప్రజ్ఞతో ఆత్మోపజ్ఞతతో తద్వివేచనం

చేశారు. అడుగడునా భావస్వాతంత్ర్యం విమర్శాపాటవం గోచరిస్తున్నది. గతానుగతికములు అననుశీలములైన భావాలను త్రోసివేయటంలో జంకు కొంకులు లేవు.

విశిష్టాద్వైత వేదాంతంలో పరిణామవాదానికి శారీరశరీరి భావానికిఉన్న పరిష్కృతీ ప్రాముఖ్యమూ అద్వైతవేదాన్తములో వివర్తవాద మాయావాద ములకు ఉన్నదన్న విషయం ఈ గ్రంథంలో విశదంగా భాసిస్తున్నది. వివర్తము సాక్షివివర్తమని ప్రమాతృ వివర్తమనియు వివేచించి పేర్కొని "ద్వాసుపర్ణౌసయుజా సఖాయా" అన్నమంత్రముతో దానిని వివరించటం సముచితముగనున్నది. యావద్గ్రంథంలోనూ అతినిశితము అతివిశదమూ నగురీతిగ వివర్తవాదము వ్యాఖ్యానింపబడినది. "వివర్తవాదస్యహి పూర్వ భూమిః వేదాంతవాదే పరిణామవాదః" అనిగదా అద్వైత దృష్టి ! ఈభావము చక్కగా వివరింపబడినది.

సత్త త్రివిధముగ పేర్కొనబడి వస్తుతత్త్వమును గ్రహించుటకు దాని ప్రయోగము నిరూపింపబడినది. పరిణామ విషయమున సమసత్తయు వివర్తవిషయమున విషమసత్తయు తెలియబడుటయెట్లో వివరింపబడినది. జగన్నిర్మాణ విధానముల వివరించి, జాగ్రద్దశలో స్వప్న జగత్తు నశించి నట్లు, జ్ఞానమను జాగ్రత్తులోనికి వచ్చిన సాధకునకు జగత్తను భావము మాత్రమే నశించునుగాని భౌతికమగు నీజగత్తే నశించునన్న భావముతో శ్రీ డాక్టరుగారు ఏకీభవించలేదు. జగత్తు రాశికి (mass) సంబంధించినది గదా! అట్టిది జ్ఞానికి మాత్రములేకుండి సర్వజనులకు ఉన్నట్టిదనుటెట్లని వారి ప్రశ్న.

త్రిగుణ విచారం వేదాంతములో కీలక విషయమని (the primal principle) అని దీనిని సుస్పష్టంగా అవగాహన చేసికొననిదే తత్త్వశాస్త్ర

భావములు సుబోధకములుగావనియు వీరి విశ్వాసము. ఇది ఎంతయు సముచితము. ఈ సందర్భములో జీవరసాయన శాస్త్ర (Biology) భావములతో చైతన్యపు స్వరూప విషయమును సమగ్రంగా అవగాహన కలుగుటకు దోహదము చేసినారు. ఆధునికమైన శాస్త్ర విజ్ఞాన సిద్ధాంతాల సాయంతో విచారణచేయుటకు సఫలమైన ప్రయత్నం ఈ గ్రంథంలో జరిగినది. ఈ తీరుగా ఒక నూతనమైన స్వీయోపజ్ఞ పూర్వకసమన్వయం చూపెట్టడానికి శ్రీ రావుగారు ప్రయత్నం చేశారు.

బ్రహ్మ జగత్తులు రెండూ ఏకకాలమందే సాపేక్ష నిరపేక్షములని, ఇవే సగుణ నిర్గుణములని ఈ రెంటికీ మిధున భావమున్నదను శ్రీ అరవిందుని భావాన్ని అనువదించారు. బ్రహ్మయందు స్వగత భేదభావాన్ని సగుణస్థాయియందు అంగీకరిస్తున్నట్లును పేర్కొన్నారు.

శాస్త్రార్థం సామాన్యునకు సుదూరం; నిశ్చితార్థం గ్రాహ్యంకాదు. సిద్ధాంత గ్రంధాలు అనంతం, అవియు బహుజటిలం బహుక్లిష్టంగా ఉంటవి. ఆ దర్శనమ్ము నిర్భరములు. వానిపై భాష్యములు, వాఖ్యానములు వివృతులు వివృత్తు టీకలు రూపొంచబడి, ఆచార్యులలో ఏక సూత్రం అంగీకారయోగ్యముగ కానరాదు. సామరస్యము దుర్లభము. సత్యంఒకటియేయైనా చూపునుబట్టి భిన్నముగ భాసించుతుంటుంది; కనుక విసంవాదం అపరిహార్యమగు చున్నది. అందుచే డాక్టరుగారు తమభావపథాన్ని తనభాషలో వేలయించి " I speek my own language " అంటారు.

సమగ్ర సమీక్షకు, వివర్తవాద వివేకము అనర్ఘము అమూల్యము అయిన గ్రంథము. గంభీరమైన శాస్త్రసారాన్ని కరతలామలకం గావించడంలో కృతకృత్యమైనది.

**(Sd) Venkata Ramaiah, M. A.**
**Retd. Principal**

# స్వభావోక్తి

శ్రీ లక్కరాజు విజయగోపాలరావు గారు తత్త్వ విచారణలో నిష్ణాతులు. "విజయగోపాలము", "ద్వాదశ మణి మంజరి" వంటి ఉత్తమ గ్రంథరచయితలు. "ఆత్మతత్త్వ వివేకము" లో అద్వైత వేదాంత దర్శనమునగల ముఖ్యవిషయ విశ్లేషణ కలదు. శ్రీమద్భగవద్గీతలో చెప్పిన త్రిగుణ వివేకమును ప్రధానముగా గ్రహించినారు. పూర్వులు చెప్పిన విషయములను వివరించుటయే ప్రధానమని భావింపక. తమ సందేహములను, వాటికీయగల సమాధానములను కూడ ఇందు చక్కగా ప్రతిపాదించినారు. ముఖ్యముగా గమనింపవలసినది వారొసంగిన సాక్షి చైతన్య విశ్లేషణ. అవచ్ఛేద, బింబప్రతిబింబవాదములను రెంటిని పరామర్శించినారు. కాని ఆంధ్రదేశమున సంప్రదాయ సిద్ధముగా వచ్చుచున్న బింబప్రతిబింబ వాదమునే వివేచించి అంగీకరించుట గమనీయము. సరళశైలిలో గంభీర భావముల నందరకు సుబోధమగునట్లు చెప్పుట చాలక్లిష్టము. ఇట్టి క్లిష్టతను అధిగమించి అద్వైత వేదాంతమును వివరించిన శ్రీ విజయగోపాలరావుగారి కృషిశ్లాఘనీయము. ఈ వేదాంత జిజ్ఞాసగలవారందరు శ్రద్ధగా అవలోకించ వలసిన గ్రంథమిదియని చెప్పుటలో అతిశయోక్తి లేదు. ఇది స్వభావోక్తి మాత్రమే.

Potukoochi Subrahmanya Sastry
**M.A., M. Litt., Ph. D., D. Litt., H.T.A.H.**
**Retd. Prof. & Head Dept. of English**
**University of NAGAPUR**

**59, Vidya Vihar,**
**Pratapa Nagar,**
**NAGAPUR-440 022**

# భక్త్యంజలి సమర్పణ

సద్గురుమూర్తీ! ప్రాకృతమగు తమ మూర్తియందు భాసించు అప్రాకృతతత్త్వమే 'గురుబ్రహ్మ' అనబడు సత్స్వరూపము. నా జీవిత లక్ష్యము తమ అభిధేయముతో ముడివడియున్నది. ఎట్లందురా? మున్నంగి యనస్థూలసూక్ష్మ కారణరూపములగు మూడు అంగములు. ఈ మూటిని అధిగమించినప్పుడేగదా స్వస్వరూపానందప్రాప్తి! ఈ అధిగమనమే నా జీవితలక్ష్యమని మిమ్మాశ్రయించితిని.

పున్న + అయ్య=పున్నయ్య పూర్ణయ్యకు తద్భవముగ ప్రసక్తమగు చున్నది. ఆర్యకు అయ్య తద్భవము. ఈ పదములకు జ్ఞానచంద్రికా ప్రసారముజేయు ఆర్యుడనియే అర్థము. ఇప్పటికి తాము పర, పశ్యంతి, వైఖరీ రీతులతో ప్రసరించిన జ్ఞానచంద్రికలు నాయందు వెలుగును వెలయింప, అదియే ఉజ్వలమై వాగ్రూపమునొంది గ్రంథస్థమగుటచే ఈ వివర్తవాద గ్రంథము వెలుగుచూచినది. మరి. తమ నామమధేయవర్ణమాల కొకకొలికి పూస యున్నదే! 'పంతులు' అని, అదియే పంత్—పండాలకు పర్యాయపదము, అనగా పండితుడు. ఇపుడు తమ అభిధేయమునకు పూర్ణమగు భావమెట్టిదన— కారణశరీరమునుకూడ సమయింపజేయుటకు వలయు సుజ్ఞానచంద్రికలగు బోధలజేయు పండితుడనియేగదా! అస్తు!

సంస్కృతాంధ్ర హిందీ ఇంగ్లీషు భాషలయందు నిష్ణాతులు ప్రస్థానత్రయ మర్మజ్ఞులు, నాయందలి జడశక్తి చిచ్ఛక్తిగ పరిణతినొంద బోధించిన దేశికులు—

బ్రహ్మశ్రీ మున్నంగి పున్నయ్య పంతులుగారికి నా భక్త్యంజలి.

# కృతజ్ఞతలు

మతగ్రంథ తాత్త్వికగ్రంథముల ప్రచురణకు దోహదముజేయ-దలయితకు, ఆర్థికసహాయ్యమునందించు పథకమును ప్రవేశపెట్టిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యమువారికి నా కృతజ్ఞతలు.

కవి, యోగి, కళాప్రపూర్ణులు, తత్త్వసాధనయందు నాకు మార్గదర్శకులు, ప్రకృతము ప్రత్నానందాభిధేయముతో ప్రకాశించు శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారు వ్రాసి యిచ్చిన మున్నుడికి నా కృతజ్ఞలను దెలుపుచున్నాను.

సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లభాషా ప్రవీణుడు, తత్త్వశాస్త్ర గ్రంథముల సదవగాహనతో నధ్యయనముజేసిన వేత్త— కళాశాల ప్రిన్సిపాల్‌గా పదవీవిరమణజేసిన శ్రీ ఎస్. వెంకటరామయ్య ఎం. ఏ., గారు ఆదరముతో నిచ్చిన ఆశయమునకు నా కృతజ్ఞతను దెలుపుచున్నాను.

గ్రంథావలోకనమాత్ర పరిజ్ఞానముతో కతిపయశాస్త్ర భావముల సమీకరించి గ్రంథరూపమున తమకందించిన నన్ను నా యోగ్యతకు మించినరీతిన అందలమెక్కించి అమూల్యమగు తమ స్వభావోక్తుల పూర్వక కలికితురాయితో నన్నలంకరించిన బహుభాషాకోవిదుడు, పరిణతజ్ఞానవిజ్ఞాన సంపన్నుడు, తత్త్వవేత్త నాగపూర్ విశ్వవిద్యాలయ ఆంగ్లశాఖాధిపతి, ఆచార్యుడునగు బ్రహ్మశ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి మహామనీషికి నా కృతజ్ఞతాంజలి.

పరమేశ్వరప్రీతి నుద్దేశించి స్వచ్ఛంద విరాళములతో ఈ గ్రంథమును తమకందింప సహకరించిన సుకృతులకు మంగళాశాసనములు.

ఎలక్టోరల్ లిస్టుల నచ్చువేయు వత్తిడికాలమునందు, సుహృదయముతో, నా గ్రంథముద్రణ కవకాశము గల్పించిన ప్రశాంతి ప్రింటర్స్ ప్రొప్రైటర్ శ్రీ ఎ. వి. సుబ్రహ్మణ్యంగారికి వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

# విషయ సూచిక

**T. Ramalingeswara Rao,**
*Editor :* Sri Sankarakrupa (Telugu)
D/ 7-8-86

63, Kodambakkam
High Road
T. Nagar
Madras – 600 017

# శ్రీః పురోవాక్

శ్రీ లక్కరాజు విజయగోపాలరావుగారి 'వివర్తవాద వివేకము' వేదాంతవిషయమున మిక్కిలి ప్రగాఢమైనది. మాయావాదముతో అద్వైత సిద్ధాంతమును సుప్రతిష్ఠితముచేసి శ్రీ భగవత్పాదులు ప్రస్థానత్రయ భాష్యములందు మాయా వివృతిని మనకనుగ్రహించిది. వివర్తవాదమేమిటి యన్నది గ్రహించినపుడు మాయావాదము సులభముగా అవగాహన యగును. ఈ వివర్త వివేకము కలుగుటకు అధ్యాసాదుల అవగాహన, భిన్న భిన్న పరిణామ వాదముల సారగ్రహణము, వేదాంత పారిభాషిక పద భావజ్ఞానము, బ్రహ్మసూత్ర భగవద్గీతాదులందు, వివర్తవాదస్థితి — మొదలగునవి ఇందు లభించినవి. మరియు వివర్తవివేకము సాధించుటకు జ్ఞానయోగవాశిష్ఠముల ఉపయోగముకూడ కలదు.

శ్రీ విజయగోపాలరావుగారు వివర్తవాద వివృతిని కావించుటలో అవసరమైన ప్రమాణగ్రంథవాక్యములనన్నిటిని ఉదహరించి సులభసుందరముగా వ్యాఖ్యానించిరి. శాంకరమైన యీ విషయవివృతి సందర్భమున శ్రీ అరవిందుల స్మరణ మక్కరలేదు.

ఆత్మతత్త్వవివేకులైన శ్రీ విజయగోపాలరావుగారు, సహస్రాధిక పూర్ణచంద్ర దర్శనము కావించి సర్వులకు వందనీయులైరి. వీరి యీ వివర్తవాద వివేకము తత్త్వానుసంధానశీలురైన వారందరికి హస్తామలకము వంటిదై, కరాలంకారము కాగలదని విశ్వసించుచున్నాను.

శ్రీః పాలయతు సర్వదా ।

—తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

శ్రీరస్తు

# వివర్తవాద వివేకము



మనకు వివర్త ప్రక్రియ విషయకమగు విద్య లక్ష్యముకాగా, దానిని గ్రహించుటకు కొన్ని లక్షణ విద్యావిషయములు ప్రధానముగ తెలియబడుచున్నవి. అవి 1. త్రిగుణ విజ్ఞానావశ్యకత 2. సత్తయందలి త్రైవిధ్యము 3. అజ్ఞాన స్వరూపము 4. అధ్యాస 5. ఖ్యాతి అనబడు శీర్షికలతో వివరింపబడినవి. ఇవియే ముందుగా తెలిసికొనవలసియున్న ఆవశ్యకములగు అయిదు విషయములు లేక ఆవశ్యకపంచకము.

త్రిగుణ విజ్ఞానమెట్లు ఆవశ్యకమో ముందు గ్రహింతము. ఆవశ్యకతను గుర్తించిన పిమ్మట అట్టివిజ్ఞానమును సముపార్జించ నుత్సహింతము. త్రిగుణములన సత్వరజస్తమోగుణములు: ఇవి లక్షణములుగ (Qualities) సంభావింపబడుచున్నను స్వరూపతః అవి పదార్థపు చరమరూపలేశములవియే తెలిసికొనవలెను. These are classified according to the three behavioural patterns they exhibit.

వైద్యశాస్త్రమును లక్ష్య విద్యగ స్వీకరించినవారికి జీవరసాయన శాస్త్రము (Biology) ఒక లక్షణ విద్యగ బోధింపబడుచున్నది. కోటానుకోట్ల జీవకణసముదాయమైయున్న ఈ మానవ శరీరమునుండి వ్యష్టి జీవకణము నొకదానిని గ్రహించి పరిశీలించినయెడల అందు :-

i) ప్రోటోప్లాజం అను నొక పదార్థము ముందు తెలియబడును. అది యీ కణమునందలి మూల పదార్థము (Basic Material) ఇది పిచ్చిలమై

(జిగురు గలిగి) యున్నందున అణుసంధానముచే పదార్థలేశము లేర్పడు టకు (Molecular formation) ఉపకరించును. దీనిని ఆయుర్వేదీయులు శ్లేష్మధాతువందురు.

ii ఇందు గర్భితములైయున్న ఎంజైములు విటమిన్లును ధాత్వగ్నికి సంబంధించినవైయున్నవి. ఇవి ఉష్ణమును కలిగించి, పోషకపదార్థముల పచనముగావించి, సారమును ధాతువుల కందించి ధాతు నిర్మాణమునకు సహకరించును. ఇదియే తత్త్వశాస్త్రమున పేర్కొనబడిన వైశ్వానర తత్త్వము మరియు ఆయుర్వేదీయుల పిత్తధాతువున్ను.

iii ఆ జీవకణమునందలి న్యూక్లియస్ అనబడు అంశ శక్తికి కేంద్రమై యున్నది. ఇదియే పిత్తశ్లేష్మముల ప్రవృత్తిని అదుపునందుంచి వాటికి నిర్ణీతములైయున్న కార్యముల జరిపింపజేయు ప్రధానశక్తి. మన పరిశీలన యందున్న వ్యష్టిజీవకణమునందలి సర్వధర్మ నిర్వహణ విధానమును అదుపునందుంచి ప్రవృత్తి క్రమవిధానమున సాగునట్లు నిబద్ధముజేయ సహకరించు ప్రాణశక్తి ఒకటిగలదు. ఇదియే ఆయుర్వేదీయుల వాతధాతువు సామాన్యముగ వాయువు అని వ్యవహరింపబడుచున్నట్టి ప్రముఖ ప్రధాన తత్త్వము. సమష్టి దేహమున ఇది పంచప్రాణశక్తుల సమష్టి. ఇట్టి వాత ధాతుసంబంధమే లేనియెడల, పిత్తశ్లేష్మములు నిష్క్రియములగును.

శ్లో॥ పిత్తఃపంగు కఫఃపంగు పంగవోమల ధాతవః
వాయునాయత్రనియంతే తత్రగచ్ఛంతి మేఘవత్ ॥

భావము : పిత్తము కఫము రెండును స్వతఃశక్తి లేనివి. అవి వాతము అనబడు పంచప్రాణ శక్తులవలన ప్రభావితమైనప్పుడు మాత్రము వాటి కార్యముల నిర్వహింప సమర్థలముగును.

ఈ మూడు ధాతువుల కార్యములు ఇంతనిగూఢములై యుండ శాస్త్ర హృదయమును గ్రహింపనివారు వాతమన కడుపు ఉబ్బరముతో గూడిన అపానువాయువని పిత్తమన వాంతియగునపుడు పడుపచ్చని పసరనియు, శ్లేష్మమన దగ్గినప్పుడు వెలికి నెట్టబడు కళ్ళె లేక కఫమనియు ఆయా ధాతువుల మలములనే ధాతువులుగ సంభావించి అపార్థముల గ్రహించి చికిత్సకు పూనుకొనుటచే ఎంత అనర్థమును కలిగించునో త్రిగుణములన బడు సత్త్వరజస్తమస్సుల సమగ్ర జ్ఞానము పొందనివారు, వేదాన్త సిద్ధాంతము ఖటంకించుచు సూటి భావముల గ్రహింపజాలరు. అట్లే వాత పిత్త కఫముల స్వరూప స్వభావముల గ్రహించిన వైద్యునకు శాస్త్రహృదయావగాహన కలిగి, చికిత్స సహేతుకముగ జరుప సామర్థ్యము సమకూడినట్లు త్రిగుణ విజ్ఞానమును సమగ్రముగ సముపార్జించినవారికిమాత్రమే శాస్త్ర హృదయము విస్పార గుణపరిణామము వివర్తపరిణామములనునవి సుబోధకములు కాగలవు. ఇందుకు గీత 14వ అధ్యాయము, 16 అధ్యాయము నవలోకించుటావశ్యకము.

## 2. సత్త

ఇది వివర్తవాద విజ్ఞానమును సముపార్జించుటకు ఆవశ్యకమగు రెండవ అంశము.

సత్తయన స్వరూప స్వభావముల ఉనికి. ఇది మూడు విధముల తెలియబడుచున్నది.

i పారమార్థిక సత్త : ఇది త్రికాలాబాధితము నిత్యసత్యమునైనట్టిది. ఎన్నడును తన స్వరూపమునందుగాని స్వభావమునందుగాని ఎట్టి మార్పును పొందనిది

ii వ్యావహారిక సత్త : ఇది లోకములో మన వ్యవహారములన్నిటి విషయమునను సత్యముగనే తెలియబడును గానీ, పారమార్థిక దృష్టికి

మాత్రము మిథ్యయే; అనగా వస్తుతః లేనిదే. అనగా త్రికాలములయందును ఉనికి స్థిరమైయుండనిది. కాగా, దృశ్యమానమగుచున్నట్టిదగు పదార్థపు తాత్కాలిక సత్త.

iii ప్రాతిభాసిక సత్త : ప్రాతిభాసికమంటే అసలు అచ్చటలేని వస్తువు యొక్క స్వరూపదర్శనము. ఉదా॥ ముత్యపు చిప్పయందు వెండి, ఎండ మావులయందు నీరు(అచ్చట లేకపోయినా)భాసించి స్ఫూర్తినిగలిగించుట. స్వప్న జగత్తును ఇట్టిదే. అచట యేమియు లేకున్నా మేడలు మిద్దెలు మున్నగునవి ఉన్నట్లే గోచరించుట. ఇది వ్యవహారమునకైనను సత్యము గాదు. ఇదియే విషమ సత్త.

ఈ సత్తల విశ్లేషణకు వివేకమునకు ప్రయోజన మెట్టిదన – కార్య కారణములలో (Cause & effect) కారణము నిత్యసత్యము, కార్యము తాత్కాలికమగు దృశ్యసత్యము అనగా మిథ్యయని గ్రహించుటయే. వివర్త మునకు ఇదే సూత్రము. ఈ సూత్రమునకనుగుణ్యమగు మరి రెండు భావము లెవ్వి యన ఎ. గుణ పరిణామమునందు కార్యకారణములు రెంటి కిని సమసత్తయే తెలియబడును (సజాతీయ సత్త) బి. వివర్త పరిణా మమునందు సత్త కారణమునందుండు నట్టిదిగాక, కార్యమునందు అందుకు భిన్నముగ, దృశ్యమాత్రస్థాయిదై యుండుటయే గ్రాహ్యాంశము. ఉదా॥ పాలు పెరుగుగ పరిణమించినను రెంటియందును సత్త సమసత్తయేనని చెప్పబడుచున్నదేగాని అది సరికాదేమో ; ఏలనన – సత్తయన స్వరూప స్వభావముల ఉనికి. పాలకు పెరుగునకును స్వరూపమునందును

భేదమున్నది, స్వభావమునందును (గుణకర్మలయందను) ప్రభావము నందును భేదములున్నవి.

# 3. అజ్ఞానము

తత్త్వశాస్త్రమునందు చక్కగా అవగాహనచేసికొనవలసిన విషయములలో ఇది మిక్కిలి ప్రధానమైనట్టిది. అజ్ఞానపు స్వరూపము ఇట్టిదని నిర్వచించి చెప్పమంటే 1. జ్ఞానము లేకపోవుటే అజ్ఞానమంటారుకొందరు. 2. జ్ఞానమంటే స్వరూపజ్ఞానమేనని, అది అనుభూతియేగానీ, 'యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ' అను సూక్తి దృష్టితో అది భావ రూపంగాకూడా తెలియబడజాలని విషయమే కావలయును. ఎమన అది వాక్కుతో చెప్పబడనేరదు మనస్సుతో ప్రాప్తింపకొనబడజాలదు గనుక, ఈ దృష్టితో సత్యవస్తు విషయకమైన జ్ఞానము లేకపోవుటయే అజ్ఞానమని మరికొందరు చెప్పుచుందురు. ఇపుడు మరొక విషయము ఎదురవు తున్నది. ఏమంటే? ఏదో కొంత జ్ఞానం వెలుగు కలిగించే తత్త్వము ఒకటి యుండవలెను. అది ఏమి? మనకు ఉన్న అజ్ఞానాన్ని అతిశ యింపజేసేది మరికొంత చీకటిని కలిగించేది ఏది? అని ఆలోచించితే అవి రెండు విధములుగా తెలియబడుతున్నవి. 1. ఆవరణ కలిగించేది ఒకటి, అంటే మనకుఉన్న యత్కించిత్ వెలుగును కప్పిపెట్టునది అన్నమాట. 2. ఆ ఆవరణలోనే ఉన్న ఒక రూపాన్నో లేక ఒక భావాన్నో మెలిదిప్పి వక్రీకరించి ఉన్న రూపాన్ని మరో మారువేషంతో ప్రదర్శించగల శక్తి ఒకటి. వీటినే తమోగుణ, రజోగుణ, ప్రభావములంటారు. గుణాలంటే అవి దేని గుణాలని అడుగుతారేమో! అవి వేపకు చేదు, చక్కెరకు తీపి వంటి గుణాలు (qualities) కావు. అవి పదార్థచరమరూపలేశములు

అని గ్రహించవలయును. చూడండి! గుణి అంటే ఒక గుణమును కలిగి యుండేది అన్నమాట. మరి గుణి లేకుంటే గుణము దేనిని ఆశ్రయించు కొని యుంటుంది? కనుక పదార్థము ఎల్లప్పుడూ ఒక గుణముతో కూడి యుంటుంది అని వైశేషిక దర్శన సిద్ధాంతము. అందుచేత ఈ సత్వ రజస్తమస్సులనబడేవి పదార్థపు చరమరూప లేశములే అని నిర్ణయింపవలసి యున్నది. సత్వగుణం జ్ఞాన కారకమైనది, ప్రతిబింబ గ్రాహకమైనది. మరియు రజస్తమో గుణకార్యములను సమతూకముతో నుంచ సహకరించు నదియై యున్నది. రజోగుణం విక్షేపము. తమోగుణం ఆవరించే స్వభావమును కలిగియున్నందున ఆ యా శక్తులను అంతఃకరణముమీదికి ప్రసరించి తమ ప్రభావమును ప్రదర్శించుతవి. అంటే, ఇప్పుడు అజ్ఞానం అనబడేది భౌతికపదార్థముల శక్తి ప్రభావము అని మనకు సుస్పష్టముగా అవగాహన అవుతున్నది. వీటి ప్రభావము అంతఃకరణముపై ప్రసరించి నందుననే మానవుని ప్రవృత్తియందు భేదములు సంభవించుచున్నవి. కొందరికి దివ్యసంపత్తి మరి కొందరికి అసురసంపత్తియు కలుగుచున్నవి. అంటే కొందరికి దయా, సత్యము, శౌచము మొదలగు సద్బుద్ధులు మరి కొందరికి హింస, అసత్యము, రాగము, ద్వేషము మున్నగు రాక్షస సహజమగు బుద్ధులు కలిగి ప్రవృత్తి సాగించుచుందురు. కనుకనే గీతా బోధయందు ప్రధాన విషయముగ యీ శ్లోకము చెప్పబడినది.

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యు జరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥
(గీ. 14-20)

భావము :- సత్వరజస్తమో గుణరూప మైనట్టియు దేహోత్పత్తికి కారణమైనట్టియు ఈ మూడు గుణముల ప్రభావ పరిధిని అతిక్రమించిన

ఆత్మ లేక దేహి, జన్మ దుఃఖము' జర, మృత్యువు, మున్నగు వికార ముల (మార్పులు) నుండి (జీవించి యుండగనే) విముక్తుడై బ్రహ్మభావ మును పొందును అనగా జన్మాది తటస్థ లక్షణములు ఆత్మను అంటవని తెలిసికొని స్వస్వరూపలక్షణముతోనే ప్రకాశించును. ఇదియే "ఆత్మానం విజానీయాత్" అను సూక్తికి తాత్పర్యము.

అజ్ఞానమును యీ దృక్పథమునుండి అవగాహన జేసికొనినవారికి మాత్రమే సాధన, సరియగు పథముల సాగి ప్రయోజనము లభించగలదు. గీతయందలి యిదియే మౌలిక బోధ. ఇదియే నాకభిమానపాత్రము, మార్గ దర్శకమునగు శ్లోకము. ఈ దైవాసుర సంపత్తులవలనే మంచి కర్మలో దుష్కర్మలో జేయుట సంభవించునని, కనుక అజ్ఞానాన్ని త్రిగుణ ప్రభా వమును నిరోధించు నిష్ఠతోనూ, నిషామకర్మానుష్ఠానముతోను, సముపా ర్జించు విధానములతోనూ తొలగించుకున్ననే జ్ఞానయోగసాధన సఫలమగు ననియు అమృతత్వము సిద్ధించుననియు గీతా బోధయందలి గ్రాహ్యాంశము.

ఇప్పుడు 'అజ్ఞానం' అనబడేది ఒక భావపదార్థముగనే గుర్తింపును సంతరించుకున్నది. ఇట్టి నిర్దుష్టమైన భావములతో గాక— ప్రతి సంద ర్భమునను నీ అజ్ఞానమే కారణమనుచు చేయుబోధ జిజ్ఞాసువును నిరుత్సాహ పరచునేగాని శాస్త్రహృదయమును విశ్వసింపజేయజాలదు. నా దృష్టిలో అజ్ఞానమంటే, రజస్తమనస్సులనబడు పదార్థముల ప్రభావముచే సంభవమైన ఆవరణ, విక్షేపములని మాత్రమే గ్రాహ్యమైనది. ఇట్లు చెప్పబడిన అజ్ఞా నము, ప్రత్యగాత్మను, ప్రమాతను మరుగుపరచగలదు. పరిచ్ఛిన్నుని చేయగలదు. బ్రహ్మమును కూడా ఆవరింప సమర్థమగు బ్రహ్మాండమైన అజ్ఞానము ఒకటి గలదేమో అది నా ఊహకందని విషయము. ముక్తికి గాను మనము చేయు ప్రయత్నము ప్రత్యగాత్మకు సంబంధించి ఉద్దేశింప

బడినదేగాని పరబ్రహ్మమే గాదని నా ఉద్దేశ్యము గనుక త్రిగుణ ప్రభావ పూర్వకమగు అజ్ఞానమునకు మాత్రమే మన చర్చలయందు అన్వయము లభించును.

ఇందుచే త్రిగుణముల స్వరూప స్వభావ ప్రభావముల సమగ్ర జ్ఞాన మత్యావశ్యకమై యున్నది. మనకు చిరపరిచితమగు తాడు – పాము ఉదాహరణయందలి పాము ఎట్లు దృగ్గోచరమగుచున్నదో గ్రహించుటకును త్రిగుణ విజ్ఞానమావశ్యకము. సాక్షిచైతన్యమునందలి తమోగుణాంశపాము రూపప్రాప్తికిని అందలి సత్వగుణాంశయే పామను జ్ఞానము ప్రాప్తించుటకును కారణములని, ఆ భ్రాంతి జ్ఞానమునందలి ప్రక్రియా విధానము విశదము గాజాలదు.

## 4. అధ్యాస

వివరవివేక సముపార్జనకు కావలసిన నాలుగవ అంశము, వేదాన్త శాస్త్రమను చక్రము పరిభ్రమించుటకు ఇరుసువంటి కీలకపదమొకటి గలదు. అదియే 'అధ్యాస'. ఈ పదము మనకందించు భావమును విశ్వసనీయముగ గ్రహించి అవగాహన (Comprehension) జేసికొని యుండని యెడల, పిమ్మట జరుపవలసిన చర్చలు, పరిశీలనలును వివేకముతో సాగింపబడనేరవు.

అవిద్య సద్వస్తువు గాదు అసద్వస్తువునుగాదు కనుక దానిని అనిర్వచనీయమని ఒక్క మాటలో శాస్త్రకారులు తేల్చిచెప్పియున్నారు. అది అనిర్వచనీయమెట్లగునో ఆ విధానమునైనను నేర్వని యెడల మనకు వివేకముగాని విశ్వాసముగాని ప్రాప్తించవు. కనుక వివేచింప యత్నింతము.

తత్త్వవిచారణచేయగా, పరమార్థమునందు లేనిదిగా తెలియబడు భావము, అనగా భూత భవిష్యద్వర్తమాన కాలములందు ఉనికి లేనిదై యుండియు, అధిష్ఠానపదార్థమును గురించినమన అజ్ఞానమువలన, 'ఏమిథ్యా పదార్థము గోచరించుచున్నదో – ఆ మిథ్యా పదార్థము, మరియు దాని యొక్క జ్ఞానమున్ను కలసి 'అధ్యాస' యను పేరుతో వ్యవహరింపబడు చున్నది. ఇది తన అధిష్ఠానమునకు (మార్పులేదు గనుక) సంబంధింపని విషమసత్తగల ఒక దృశ్య విశేషము. ఇట్టి దృశ్యభావమున్ను, దాని యొక్క జ్ఞానమున్ను (a knowledge of the apparent appearance) కలసి అధ్యాసమగుచున్నది. This is a phenomenon seen or felt by the senses with their limitations (ie) with-out any knowledge of the hidden force by which that phenomenon was caused. It is thus strange and impermanent. ఇది ఒక వస్తువుయొక్క సంకీర్ణాంశముల సంకలన స్వరూపము. కనుక మిశ్రజాతికి చెందిన విషమ స్వరూపప్రదర్శన. అధ్యాస అజ్ఞానముయొక్క ఒక లక్షణమేగాని స్వరూపజ్ఞానమునకు చెందినది గాదు. ఇది ఎట్లు ప్రాప్తించుననన వస్తుతత్త్వము తెలియనందున, అనగా అధిష్ఠాన పదార్థము యొక్క జ్ఞానము లేనందున – రజస్తమోగుణములయొక్క ప్రభావము, కించిజ్ఞుడగు జీవుని అంతఃకరణముపై ప్రసరింపగా అధిష్ఠానమునందు మరొక ఇతరవస్తు రూపమునకు స్ఫూర్తి కలుగును. కనుక ఈ గోచ రించు వస్తురూపము సహజ వస్తువునందు అధ్యారోపింపబడుచున్నదని భావము కనుక అధ్యాసయందు రెండు అంశలు గలవు. 1. భ్రాంతి జ్ఞానము 2. ఆ భ్రాంతిజ్ఞానమునకు విషయమై కనిపించు మిథ్యాస్వరూపము. ఈ రెంటి కలయికయే అధ్యాస, అవభాసము లేక వివర్తము.

ఇది రెండువిధములు

1. కేవల మిథ్యయగు వస్తువుయొక్క జ్ఞానము. దీనిని అర్థాధ్యాస యందురు. అర్థమన వస్తువు. ఇందు లేని వస్తువు ఉన్నట్లు భాసించుటయే.

2. కేవల భ్రాంతి జ్ఞానము. అట్టి వస్తువును గురించిన జ్ఞానము నందలి మార్పు జ్ఞానాధ్యాస.

అర్థాధ్యాస మరల రెండు విధములు :

i స్వరూపాధ్యాసము. చెప్పబడే వస్తువు ఉన్నదీగాక లేనిదీగాక యుంటుట. ఎట్లన ఆత్మయందు అనాత్మవస్తువులగు అహంకార ధర్మములు భాసించటమేగాని, స్వరూపతః లేకుండుట.




ii సంసర్గాధ్యాసము : రెండు భిన్న పదార్థ స్వరూపములు సిద్ధమైయుండగా, ఆ రెంటి సంబంధము ఇట్టిదని చెప్ప వీలుగాకుండుటయే. ఇది రెంటి కలయికవల్ల కలిగినట్టి అధ్యాస. సంసర్గమన రెంటి కలయిక. ఉ॥ స్వచ్ఛమగు ఒక స్ఫటికము మరియు నొక ఎఱ్ఱని దాసాని పూవు తీసుకుని చెప్పిరి. ఇవి రెండును ఇదివరకే సిద్ధమై వ్యవహారమునందున్న భిన్న పదార్థములు. వీటికి ఏమీ సంబంధము లేదు. ఐనను వీటిని, ఒకదాని దగ్గ

రలో మరియొక దానినుంచినయెడల ఈ పుష్పము యొక్క ఎఱుపురంగు స్ఫటికమునందు ప్రతీతమగుట విశేషము. స్ఫటికమే ఎరుపురంగుదా? యను భ్రాంతిని కలిగించుచున్నది. ఇలా స్ఫటికమునందు కలిగిన మార్పు సంసర్గమువల్లనే ప్రాప్తించినదని అందురు. మరియు ఇది అనిర్వచనీయ మనియు అందురు.

స్ఫటికముయొక్క తెలుపు వర్ణము ఇతర వస్తువుల ప్రతిఫలింప సమర్థమైనట్టిది గనుక పూవుయొక్క ఎరుపును ప్రతిఫలింపజేసినదని గ్రహించుట సులభమేగదా! ఇది అనిర్వచనీయ మెట్లగునని నా సందేహము. మరియు ఇచట స్ఫటికము పూవుయొక్క ఎరుపు సమ్మిళితము గాలేదు. ఐనను సాన్నిధ్యమువలన మాత్రమే ప్రతిఫలింప సంభవమైనది. కనుక, ఇది సంసర్గమునకు సరియగు ఉపమానము కాదను విషయము గుర్తుంచుకొనదగినది.

ఇక, పై జెప్పిన ఉదాహరణమును అనువర్తించుచు తాత్త్వికవిషయ పరమైన విజ్ఞానమును పొంద యత్నింతము. చైతన్యము పారమార్థిక పదార్థము. అహంకారము లేక అంతఃకరణము వ్యావహారికమునై యున్నది. ఈ రెండును సంబంధము లేని ప్రత్యేక భావములే. చైతన్యమునకు అహంకారమునందు అధ్యాస లేదు. కానీ చైతన్యముయొక్క ఆత్మతారూప మైన తాదాత్మ్య సంబంధము అహంకారమునందు ప్రతీతమగుచున్నది. ఆ చైతన్య సంబంధమగు ఆత్మత (Self) అహంకారమునందు అనిర్వచనీయ ముగ పుట్టుచున్నది. ఇది సంసర్గాధ్యాసము. సాత్త్వికాహంకారము ప్రతి ఫలింపయోగ్యమై యున్నందువలన ఇదియును అనిర్వచనీయము కాదేమో నని నాకు తోచుచున్నది.

అర్థాధ్యాసమునందు ఆరు భేదములు కలవు.

1. కేవల సంబంధాధ్యాస : ఉ|| స్ఫటికమున జపాకుసుమము యొక్క ఎఱ్ఱదనము తాదాత్మ్యముతో భాసించుట

2. సంబంధ సహసంబంధాధ్యాసము : ఆత్మయందనాత్మయొక్క స్వభావము, స్వరూపము రెండును అధ్యస్తమగుట.

3. ధర్మాధ్యాస : ఆత్మయం దనాత్మ పదార్థముల ధర్మములు మాత్రమే అధ్యస్తమగుట.

4. ధర్మసహిత ధర్మిఅధ్యాస : అంతఃకరణముయొక్క కర్తృత్వాది ధర్మములను ధర్మముల కాధారమగు అంతఃకరణకును ఆత్మయందుగలుగు అధ్యాస.

5. అన్యోన్యాధ్యాస : ఒక లోహపుముక్కను అగ్నియందు ఎఱ్ఱగా కాల్చిన—ఆ ఇనుపముక్క, అగ్నియొక్క దాహకధర్మము నాహ్వానము జేసికొని, అగ్ని స్వరూపమునుగూడ పొంది, తాను అగ్నియే అయి భాసించుట తటస్థించుచున్నది. ఇదియే లోహాగ్ని న్యాయము. దీనిని అన్యోన్యాధ్యాసమందురు, కాని దీనిని సంసర్గాధ్యాసమనుట హేతుపూర్వకమగును. ఈ అన్యోన్యాధ్యాసను గుర్తించుకొనుట ఆవశ్యకము.

6. అన్యతరాధ్యాస : అనాత్మయగు అహంకారాదులయందు ఆత్మయొక్క స్వరూపము అధ్యస్తము కానేరదు. కాని, ఆత్మయందు మాత్రము అహంకారము మున్నగు అనాత్మ పదార్థముల స్వరూప జ్ఞానము అధ్యస్తమగుచున్నది. ఇందు రెంటిలో ఒకదానియందుమాత్రమే అధ్యస్తము ప్రాప్తించును.

# ఖ్యాతి

ఆత్మ బ్రహ్మ స్వరూపమని తెలియని ఏ అజ్ఞానము గలదో, దానిచే మిథ్య ప్రతీతమగు చున్నది. అంటే స్వరూపతః సత్యముగాని దృశ్యము కనిపించుట అన్నమాట. ఎచ్చట తాడునందు పాముయొక్కయు, ముత్యపు చిప్పయందు వెండి యొక్కయు భ్రాంతి కలుగుచున్నదో అట్టి భ్రాంతిని పలువురు పలు విధముల గ్రహించి తెలుపుచున్నారు. ఇవియే ఖ్యాతి యందు విభేదములు ఖ్యాతి యన భానమగుట, స్ఫురించుట, ప్రతీతమగుట, కథనము జేయుట అని అర్థము.

ఎట్లన :—

1. శూన్యవాదులు చెప్పునది అసత్ఖ్యాతి
2. క్షణిక విజ్ఞాన వాదులు చెప్పునది ఆత్మఖ్యాతి
3. నైయాయికులు వైశేషికులు చెప్పునది అన్యథాఖ్యాతి
4. సాంఖ్యులు చెప్పునది అఖ్యాతి యనియు అందురు.
౫. వేదాంతులు చెప్పునది అనిర్వచనీయఖ్యాతి.—

—గనుక మనకు ప్రకృతము. దీనిని వివరింతును. వినండి. ఒక కుండ ఉన్నదనుకొనండి, దానిని చూచుటకు, తెలిసి కొనుటకు అంతఃకరణ వృత్తి నేత్రాదీంద్రియముల ద్వారా బయలు పడి కుండ ఆకారమును పొందినప్పుడు, ఆ వస్తువు (విషయము) యొక్క ఆవరణమునకు భంగము కలిగి ఆ వస్తువు తెలియబడుచున్నది. ఇచ్చట వస్తుజ్ఞానము కలుగుటకు ప్రకాశము (సూర్యుడు, దీపము మున్నగునవి) యొక్క సాయము కలుగు చున్నది. రజ్జువు నందు సర్పభ్రమ కలిగినప్పుడు అంతఃకరణవృత్తి

నేత్రముల ద్వారా బయలు పడినను, వెలుగు యొక్క హీనత ప్రతిబంధమై, ఆవృత్తి చేరజ్జువునకు ఆవరణ భంగము కలుగదు. అనగా తాడుతాడుగా తెలిసికొనబడదు, అనగా ఆతాడు స్వరూపము సుస్పష్టముగా (with clarity) దు. అందుచే వృత్తి యొక్క స్వరూపము రజ్వాకారముగా లేదు. రజ్జువునకు రెండంశలు కలవు 1. 'ఇది'-అంశ. అంటే ఇదియేదో వున్నదిగాని. అదితాడో, కర్రో మరియేదో ఇంకనూ స్పష్టము గాని స్థితి. 2. 'తాడు' అంశ. 'ఇది' సామాన్యంశము (General Idea) ఇది అనుటచే రజ్జువు యొక్క సామాన్యాంశమునునకు మాత్రము ఆవరణ భంగము కలిగినది. అందుచే ఇది ఏదో ఉన్నది అని తెలియబడుచున్నది గానీ తాడు అని తెలియబడదు; అంటే రజ్జువునకు ఆవరణ భంగము (Clarity) సంపూర్ణముగ కలుగలేదు. అందుచే రజ్జు చైతన్యము నందుండే అవిద్యయందు క్షోభము (Commotion) కలిగి ఆ అవిద్య సర్పాకారమును బొందుచున్నది. ఈ సర్పము నిజమైన యడల (సత్తగునెడల) తాడు యొక్క జ్ఞానము కలిగినప్పుడు తాను బాధింపబడకూడదు అంటే లేనిది కాకూడదు, అసత్తైనయడల (నిజంగాలేనిది) అది అసలు ప్రతీతముగా కూడదు అంటే పామువలె కనిపించకూడదు. ఇట్లు 'ప్రతీతముకాకూడదు' 'లేనిదీకాకూడదు' అనుటయే సదసద్విలక్షణము. దీనినే అనిర్వచనీయమందురు.

ఇప్పటి మనము తెలిసికొనవలసినదేమన—సర్పము ఎట్లు అవిద్యా పరిణామమో' దానియొక్క అజ్ఞానరూపవృత్తియు అవిద్యా పరిణామమే యగుచున్నది. కానీ అంతఃకరణపరిణామము గాదు. రజ్జువుతో కూడియున్న చైతన్యమునందు తమోగుణప్రధానమైన అవిద్యాంశము యొక్క పరిణామము సర్పముగను, సాక్షి చైతన్యము నందుండు సత్వగుణ పరిణామము సర్పజ్ఞానముగను రూపొందును.

వివర్తమనసెట్టిదోనిపుడు గ్రహించండి. అవిద్యయొక్క తమోగుణ పరిణామము సర్పముగను. సాక్షి చైతన్యమునందలి సత్వగుణ పరిణామము సర్పజ్ఞానముగను వివర్తమగును.

పై జెప్పబడిన రజ్జు సర్ప విషయ పూర్వకమగు ఉపమానమునందు తమోగుణాంశముచేత (తాడనిగాని పామనిగాని తెలియబడని) ఒక రూపమున్ను జ్ఞానకారకమగు సత్వగుణ ప్రభావమువల్ల ఆ రూపమునందు తెలియబడు అధ్యారోపితమగుపాము జ్ఞానమున్ను ఉపలబ్ధమైన ప్రక్రియవల్ల–పరిశీలకులు అవిద్య ఎట్లు పరిణమించునో అధ్యారోపమెట్లు ప్రాప్తించునో గ్రహించుటకును, త్రిగుణముల సమగ్రగుణ క్రియల, జ్ఞాన ఆవశ్యకత ఎట్టిదో తెలియుచున్నది.

ఎపుడు రజ్జు చైతన్యము నందు స్థితమైయున్న అవిద్య సర్పాకారముగా పరిణమించునో అపుడు సాక్షి చైతన్యమును ఆశ్రయించియున్న అవిద్య సర్పాకార సర్పజ్ఞానములుగ పరిణమించును. కనుక భ్రమస్థలమునందు సర్పము దానియొక్క జ్ఞానమున్ను ఏక కాలమునందే కలుగుచున్నవి. మరియు రజ్జువు అధిష్ఠానము అనుజ్ఞానముచే ఏకకాలమునందే అవి లయమగు చున్నవి. రజ్జువునందు అనిర్వచనీయమైన సర్పమును దానియొక్క జ్ఞానమునున్ను భ్రమ, అధ్యాస, అవభాసము అను పదములతో చెప్పుదురు. భ్రమ అవిద్యయొక్క పరిణామముగను చైతన్యముయొక్క వివర్తముగను నున్నది. అంటే చైతన్యమునందు మార్పుగలుగకయే పాముగా కనిపించినది; అవిద్యయందు మార్పుగలిగిపాముగా భాసించిన దన్నమాట

ఈ భావమును గ్రహించుటకు సహరించుటకు ఒక ఉపమానమెట్టిదన—ఒక నటుడు తాను ప్రదర్శించునది ప్రగాఢ దుఃఖభావమైనను

అదుఃఖముతో తాను తాదాత్మ్యము నొందక తన ప్రదర్శనాకౌశలమును మాత్రమే తాను గుర్తించుచు తాను నిర్లిప్తుడుగ నుండి తన స్వరూపానందమునందు మాత్రమే తాను రమించునట్లు నిగ్రహింపనగును.

గ్రాహ్యాంశము : ఉపాదానముతో సమాన స్వభావముగలిగి అన్యథా స్వరూపమును పొందుట పరిణామము. ఇందు కార్యకారణములు రెంటియందును సత్తమాత్రము సమసత్తయే అంటే సజాతీయమే. అధిష్ఠానమునకన్న విపరీత స్వభావము గలిగిన, అన్య స్వరూపమును గోచరింపజేయుట వివర్తమని గ్రహించవలెను.

పరిణామ — వివర్తములు

| ప్రక్రియ | స్వభావము | స్వరూపము | కారణము |
|---|---|---|---|
| పరిణామము | ఉపాదానమునకు అభిన్నము | ఉపాదానమునకు భిన్నము | పదార్థమే ఉపాదానము |
| వివర్తము | భిన్నము | భిన్నము | బ్రహ్మ అధిష్ఠానము |

వివర్తమునందు స్వభావ స్వరూపములు రెండును అధిష్ఠానమునందలి స్వభావ స్వరూపములకు భిన్నములే

సారాంశములు : I ఉపాదానమైన అవిద్య ఎట్లు అనిర్వచనీయమో అట్లే అసర్పము అసర్పమును గురించిన జ్ఞానము అనిర్వచనీయములే.

II సర్పము దాని విషయమైన జ్ఞానము అవిద్యా స్వరూపముగలవి కనుక నివి రెండును అవిద్యయొక్క పరిణామములు

# నివృత్తి

అవిద్యాపరిణామముచే ప్రాప్తించిన ఈ ప్రపంచమునకు నివృత్తి ఎట్లని ఇక విచారింతము. నివృత్తియన పిడిచిపోవుట, వీగిపోవుట, లయించి పోవుట. ఇది రెండు విధములు. 1. కారణ సహిత కార్యనివృత్తి. దీనినే ఆత్యంత నివృత్తి అంటారు. అంటే కారణమగు అవిద్యయు కార్యమగు జగత్తున్నూ లయించిపోవుట. 2. కారణమగు అవిద్య అట్లేయుంచి కార్యమగు జగత్తు ఆ అవిద్యయందే లయమగుట లయ నివృత్తి.

సుషుప్తియందు అజ్ఞానమునందు లయించేవి ఇంద్రియ శక్తులు. అట్లే సర్ప నివృత్తి రజ్జుజ్ఞానము చేతను, సర్పజ్ఞాన నివృత్తి, సర్పము యొక్క అభావజ్ఞానముచేతను కలుగవచ్చును.

అనిర్వచనీయమని చెప్పబడిన అధ్యాసమును నిర్వచింప దగినంత వరకు గ్రహించితిమి. ఇక వివర్త సాహిత్యమును వివర్తమునందలి ప్రక్రియలను, వాటియందలి భావభేదములను పరిశీలింతము :

# వివర్త విషయక పరిచయ ప్రస్తావన

అద్వైత బ్రహ్మవాదమును సమర్థించి సిద్ధాంతీకరించుటకు సహకరించుటకు ప్రముఖ సాధనము మాయావాదముగ ప్రవర్తమగుచున్న వివర్తవాద విద్యయే. జగన్నిర్మాణ విధానములుగ జెప్పబడుచున్న ఆరంభ పరిణామ సంహతి వివర్తాది వాదములలో శాస్త్రదృష్టితో సమర్థింప బడినది ఈ వివర్తవాదమే. ఇది శంకరునకభిమానపాత్రమై, ఆయన భాష్య రచనలయందు తరుచు ప్రయోగింపబడుచున్నందున విజ్ఞులచే వైదిక ధర్మ సంజీవినిగ సముచిత స్థానమును సంతరించుకొన్నట్టిది.

బ్రహ్మసూత్ర శంకరభాష్యమునందలి ప్రతి అధికరణమునందును 'వివర్తవాదము పడుగుపేకపలె అంతర్లీనమైయున్నట్లు తెలియబడుచున్నది. ఇట్టి వివర్తప్రక్రియ ప్రస్తావింపబడియుండక పోయిన - అసలు దృశ్యము - ద్రష్ట, ప్రమాణము — ప్రమేయములను భావములుగాని, భోక్తభోగ్యములు గాని కర్తకారయితలుగాని పేర్కొనబడుట కవకాశముండెడిదేగాదు.

అంటే ఈ వివర్తభావమువల్లనే ద్వంద్వములు ద్వైత భావములు వ్యవహారమునకు వచ్చియున్నవి. ఇట్టి వివర్తప్రక్రియ ప్రాప్తించి యుండనియెడల ఉండేది ఒకేవకదివ్య పదార్థయేగదా! "సదేవసోమ్యే ఇదమగ్రఆసీత్-ఏకమేవ - అద్వితీయం" అనుశ్రుతివాక్యముచే ప్రతిష్ఠింప బడినది సనాతనసత్పదార్థమేగదా! దానినే వ్యవహారసౌలభ్యము కొరకు 'బ్రహ్మము' అనివ్యవహరించు చున్నాము! 'అధ్యాసభాష్యము' అను పేరుతో వ్రాసిన తన ఉపోద్ఘాతమునందు శంకరులు ప్రస్ఫుటించిన భావములీభావములకు ఆలంబనమిచ్చుచున్నవి.

అధ్యాసయన వివర్తమే. వివర్తమన - 'కారణము,' తన స్వరూపమునంచెట్టిమార్పును బొందకయే అసత్యములు అనిత్యములనగు నానారూపములతో కార్యములు భాసమానమగుటయే. ఈ భావమునే 'పూర్వరూపాఽపరిత్యాగేన అసత్యనానాకార ప్రతిపత్తిభాసః వివర్తః' అని సాయణుడు అధర్వణ భాష్యమున జెప్పిన సూక్తి ఇందుకు ప్రమాణ వచనముగ పరిఢవిల్లుచున్నది. బీజాంకుర న్యాయమునందలి భావమును దెలుపుచున్నది. ఎమన - బీజశక్తి యెంతెట్టి మార్పును సంభవింపకయే దాని ప్రభావమువలననే అంకురము శాఖలు, ఆకులు, కాయలు, ఫలములుగ రూపొందు విధానము వంటిదే ఈ వివర్తమున్ను. ఒక మర్రిగింజయెంత? దాని యందలి బీజశక్తి ఎంత? ఐనను అది మర్రికాయ, మర్రిఆకు, మర్రి

పూడమున్నగు రూపములతో మనకు తెలియబడుచున్నది. ఈ పదములలో మఱ్ఱియనునది మౌలిక భావపదార్థమై ఆకుకాయ........ పువ్వు, ఊడ మున్నగునవి కల్పితములైనట్లు, 'మఱ్ఱి' వంటి బ్రహ్మముయొక్క కారణ స్వరూపమును గ్రహించవలయుననుట కే ఈ బీజాంకుర న్యాయసామ్యము.

ఇచట మనము గ్రహించవలసిన విషయము ప్రధానము, అంటే మూలపదార్థము. అది జడము అచేతనమును అయియున్నది.

చైతన్య ప్రభావముచే పరివ్యాప్తముగా నిదే అది ప్రకాశింపబడ జాలదు. అంటే అది ఫలాన యని చెప్పబడజాలదు. అందుచేత, చేతన పురుషాధిష్ఠిత ప్రకృతి (మాయ) యో, లేదా మాయాధిష్ఠిత చైతన్యమగు ఈశ్వరుడో జగత్కారణముగావలయును. కనుక ఈశ్వరునకతిరిక్తమగు జగత్తు ఉండనవకాశములేదు. కనుక భిన్నవస్తు రూపములగుపడుటకు వాటికి కారణమగు మృత్తిక సత్యమని తెలియుచున్నది. దాని నుండి ఒక నిమిత్తకారణముచే రూపొందింపబడిన కుండ, చట్టి, తొట్టి మున్నగు 'కార్యము' లనబడు ఆకారములు మిథ్య: అనగా తాత్కాలికముగ ఉన్నట్లే కనిపించినను నిజానికి లేనట్టి రూపములేయని నిర్ధారణ యగుచున్నది.

ఇప్పుడు పరిణామ మననేమి వివర్తమననేమి యని స్థూలముగ నిర్వచించి తెలిసికొందము.

శ్లో॥ యస్తాత్త్వికోఽన్యథా భావో పరిణామ ఉదీరితః।
అతాత్త్వికోఽన్యథా భావో వివర్తః స ఉదీరితః॥

భావము : అన్యథా భావమనగా— అసలు వస్తువునందు మార్పు సంభవమైనందున ప్రాప్తించే మారు రూపము. ఇది గతితార్కికభౌతిక ప్రక్రియతో స్పందన, సంచలనములవల్ల సంభవమగును. ఇచ్చట పదార్థమునందు

పూర్వ నిజముగా కలిగినదిగనుక మనకు కనిపించే అన్యథాభావము (మారురూపము) పరిణామ ప్రక్రియచే ప్రాప్తించినదగును. అట్లు నిజముగా కలిగినదిగాక, కేవల భ్రాంతి జ్ఞానము వల్లనే కలిగినట్టి దైనయెడల వివర్తమనబడుతుండిగాని పరిణామమనబడదు. కనుక యదార్థమైన అన్యథాభావము పరిణామము. అయదార్థమగు అన్యథాభావము (అనగా భ్రాంతి జ్ఞానమువలన కలిగిన దృశ్యము) వివర్తమని నిర్ధారించవలసి యున్నది. ఈ సందర్భమున (పీఠికలోని సతత్త్వతోఽన్యథా ప్రథా అను శ్లోకభావమును మననము జేయుడు)

ఈ విషయములు సుబోధకమగుటకు శంకరుని 'మహావాక్యదర్పణం' అను గ్రంథమునుండి కొన్నిశ్లోకముల భావము గ్రహింతము

శ్లో॥ అధిష్ఠానాన్యథా భావమాత్రమేవయతో జగత్
తతోఽధిష్ఠాన మాత్రత్వం జగతోనవిరుధ్యతే॥ 97

తా॥ రజ్జుసర్ప విషయములో అధిష్ఠానమగు తాడుయొక్క జ్ఞానము కలుగగనే - దానియందు ద్రష్ట ఆరోపించి చూచిన పదార్థములన్నియు అసత్యములేయని అవిలేనివేనని తెలిసి అధిష్ఠానమగు తాడు మాత్రమే నిజమైనిలుచును. అవి లేనివేనని తెలియబడుతవిగానీ, దేనియందునులయమై పోవు. ఇదే విధముగ బ్రహ్మయే జగద్రూపమున భాసించుటజేసి మనము బ్రహ్మపదార్థస్వరూపమును అనుభూతికి తెచ్చుకున్నపుడు - అనగా అధిష్ఠానమును (ఆత్మను) తెలిసికొన్నపుడు, ఆత్మకంటే అతిరిక్తమగు మరొక వస్తువు లేదని గ్రహింపగలము.

తాడునుచూచి భ్రమచే మన బుద్ధియందు కల్పించుకున్న పాము యొక్క జ్ఞానము కల్పితముగావున, యదార్థ వస్తుజ్ఞానము కలిగినంతనే, ఆ సర్పజ్ఞానము తనకు ఉపాధానమగు అజ్ఞానముతోపాటు నశించును.

ఇట్లు ఉపాదాన కారణము (అజ్ఞానము) నశించుటచే యీ సర్పము దేనియందును లయము పొందకయే లేనట్టిదగును.

గ్రాహ్యాంశము : బ్రహ్మజ్ఞానము ప్రాప్తించినవారికి జగత్తు అధిష్ఠాన బ్రహ్మస్వరూపముగనే అనుభూతియగును.

శ్లో॥ నైతావన్మాత్రతో బ్రహ్మజడం భవితుమర్హతి।
నదృశ్యం, నాప్యనిత్యంచ, నచసావయవంతథా ॥ 98

తా॥ బ్రహ్మకన్న జగత్తు అభిన్నమని చెప్పబడినందున మాత్రమున, జగత్తువలె బ్రహ్మకూడా అచేతనమనిగాని అనిత్యమనిగాని, దృశ్యమనిగాని అవయవములతో గూడినదనిగానీ తలచరాదు. ఎట్లన :

శ్లో॥ స్వస్మిన్ కల్పితతోయస్య స్వమాత్రత్వేతుకింమరోః
జీవితాద్రవతావాఽపి జలధర్మోవిలోక్యతే ॥ 99

తా॥ ఎండమావులలోని కల్పితజలమునకు, అధిష్టాన స్వరూపమున కంటే అతిరిక్తమైన స్వరూపములేదు. ఐనను, జలమునందుండెడి శైత్యముగాని, ద్రవత్వముగాని, మనకుతెలియబడుటలేదు. అట్లే బ్రహ్మ యందు ఆరోపింపబడిన జగత్తుయొక్క జడిత్వాది ధర్మములు బ్రహ్మకు సంభవింపవు.

శ్లో॥ విశ్వంబ్రహ్మభిన్నమేవ స్వయంభవితుమర్హతి।
అధిష్ఠానాతిరిక్త స్వరూపత్వాద్భుజాహివత్ ॥ 107

తా॥ రజ్జుసర్పము అధిష్ఠానమునకంటె (తాడుకంటె) వేరైన స్వరూపము కలిగియుండక అధిష్ఠానమగు తాడు స్వరూపముననే భాసించుటవల్ల అతాడు కంటె ఈ భాసించినపాము వేరుకాదు. అట్లే అధిష్ఠానమైన బ్రహ్మకు

అతిరిక్తమైన స్వరూపములేకయే, జగత్తు బ్రహ్మస్వరూపముననే భాసించుట వల్లనే ఈ జగత్తు బ్రహ్మకన్న భిన్నముకాదు. విశ్వం-బ్రహ్మభిన్నం— అధిష్ఠానాతిరిక్త స్వరూపత్వాత్—అని ప్రయోగముగలదు.

శ్లో॥ బ్రహ్మత్మనాజగద్భాతి శుద్ధబుద్ధేర్మహాత్మనః।
బ్రహ్మైవజగదాకృత్యా భాత్య శుద్ధధియోఽపతః॥ 114

భావము : అపరిశుద్ధమైన అంతఃకరణముగల వారికి బ్రహ్మ జగదాకారమున భాసించును. నిర్మలాంతః కరణము పొందిన మహాత్ములకు అనగా రజస్తమోగుణముల ప్రభావ పరిధినతిక్రమించినవారికి జగత్తు బ్రహ్మాకారముగనే అనుభవమగును. ఇదియే వివర్తమునకు ఋజుభావము.

ఈ సందర్భమున గీతా భావములకూడా పరిశీలించి మనవిశ్వాసమును

పెంపొందించుకుందము.

శ్లో॥ మయాతతమిదంసర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్స్థానిసర్వభూతానినచాహంతేష్వవస్థితః॥ 9-4

తా॥ కంటికికనబడుచున్న జగత్తంతా--మనస్సుచే సుగ్రాహ్యము చేసికొనవలను పడని ఇంద్రియ గోచరముగానట్టి, అవ్యక్త స్వరూపమగు నా యొక్క ఉత్కృష్టమగు పరమాత్మభావముచే వ్యాపింపబడియున్నది. సర్వభూతములును నాయందున్నవి. అంటే నా యొక్క స్వరూపముచే ప్రభావితమైనందుననే నాయందున్నవని చెప్పబడినది. కానీ ఆ భూతముల యందు నేను మాత్రము నా ఉనికికి ఆధారపడి యుండను. సమస్త జగత్తున్ను అవ్యక్తమూర్తినగు నాపరమాత్మభావ ప్రభావితమైనందుననే నాయందున్నట్లు చెపబ్బడుచున్నది. ఈ శ్లోకభావము వివర్తమును సూచనజేయుచున్నది. అంటే సర్వభూతములయందున్న ఆత్మఏదియో అదియే భూత విస్తరణకు కారణము. అనగా బ్రహ్మమునకు అధారముగానీ ఆధేయము

గాని కాదు. ఆత్మయొక్క ఆలంబనము కలిగినపుడు భూతములు రూపము పొందును. కానీ అవిశాశ్వతములుగావు గనుకనే వాటికి విపర్త భావము వర్తించును.

శ్లో॥ న చమత్స్థాని భూతాని పశ్య-మే-యోగమైశ్వరమ్ ।
భూతభృన్నచ భూతస్థో మ మాత్మా భూతభావనః ॥ 9-5

తా॥ ఐశ్వర్యం అనగా ఈశ్వర సంబంధమగు నా యోగమును చూడుము. సమస్త భూతములును నా యందున్నవైనప్పటికి -- భూతముల ఉత్పత్తి స్థితులకు కారణబూతమగు నా స్వరూపము భూతములను ధరించినదియు, భూతములయందున్నట్టిదియుగాదు.

ఉ॥ రజ్జుసర్పస్థలమునందు సర్పముయొక్క యుత్పత్తిస్థితులకు కారణ భూతమగు రజ్జువు అధిష్ఠానమైయున్నను, సర్పముచే భావనచేయబడుచున్నను సర్పమునకు ఆధారముగానీ, అధేయముగాని యెంతమాత్రముగా నేరదు. అంటే భూతములయొక్క ఉత్పత్తిస్థితులకు కారణభూతమైనట్టియు. భూతములచే భావనచేయబడునట్టియు బ్రహ్మము భూతములకు ఆధారము గానీ ఆధేయముగానికాదు.

శ్లో॥ యేచైవసా త్త్వికాభావా రాజసాస్తామసాశ్చయే ।
మత్తయేవేతితాన్విద్ధి నత్వహంతేషుతేమయి ॥ 7-12

శ్లో॥ త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదంజగత్ 7-13
మోహితంనాభిజానాతి మామేభ్యఃపరమవ్యయమ్॥

తా॥ సత్వరజస్తమోగుణములకు సంబంధించిన భావములేవి యున్నవో అవి అన్ని నావల్లనే పుట్టినవని తెలిసికొనుము. అయినప్పటికి నేను వాని

యందు లేను. కాని వాటికినేనాధారమైయున్నాను. తా॥ నాయందు, పరా ప్రకృతి సంయోగముచే రజ్జుసర్పములవలె వెలువడిన సకల భూతములను శబ్దాది విషయములయందలి రాగద్వేషమోహాదులచే నావరింపబడి విషయ ప్రీతితో పూరింపబడి నాయొక్క పారమార్థిక స్వరూపమునెరుగలేకున్నారని భావము.

## వివర్తసాహిత్య పదభావములు

వివర్తవిద్యయందు అచ్చటచ్చట చెప్పబడుతున్న సాంకేతిక పదములకు సూటియగు అర్థములు, భావములను అవగాహన జేసికొననియడల శాస్త్రమునందు గుప్తముగనున్న భావములు గ్రహింపబడజాలవు. అందుచే లక్ష్యము సిద్ధించదు. కనుక నా పదముల అర్థములను భావములను ముందు గ్రహించుట అవశ్యకము. సృష్టియందు గన్పించు మార్పులు పరిణామమువలననే ప్రాప్తించుచున్నవని అది పదార్థమునందు నిజముగా గలుగు మార్పులవల్లనేనవి భౌతికవాదులు తెలుపుటయేగాక పారమార్థిక వాదులును వివర్తమునకు పూర్వస్థితిలో పరిణామమును అంగీకరించి యుండిరి ఇందువల్ల పారమార్థికులునున్నూ భౌతికమును ఒక స్థాయిలో అంగీకరించియుండిరి. కాగాపారమార్థికులు పరిణామమునకు పైస్థాయిదగు వివర్తవాదమునుదెలుపుచున్నారు.

వికారమనగా ఒక వస్తురూపురేఖల యందుగలుగు మార్పు. వికారములు పరిణామముచేతనేగాక వివర్తమను ప్రక్రియవల్లను కలుగును. వివర్తవికారములు రెండువిధముగ దెలుపబడుచున్నవి — ప్రమాతృ వివర్తము సాక్షి వివర్తమునని.

# వికారము

(రూపునందు నిర్మాణమునందు మార్పు)

పరిణామ వికారము | వివర్త వికారము

**1. పరిణామ వికారము**

ఇందు సమసత్తయున్నది. సత్తయన మారురూపమునకును సహజ రూపమునకును గల సాజాత్యత) కనుక ఇది భౌతిక మగు పదార్థమునకు సంబంధించినది.

**2. ప్రమాతృవివర్తము**

ఇందు ప్రమాతయన జీవుడు. ఈతడు అవిద్యతో కూడినవాడు. ఈతనికిగల అజ్ఞానదృష్టితో గ్రహించినరూపమును ప్రమాతృ వివర్తమందురు. ఈతడు అజ్ఞానమునకు స్వాధీనుడైయుండును. ఈతనిది విషమసత్త అంటే అసలు పదార్థమునందు మార్పు జరుగకయే దృశ్యము మాత్రము మారురూపమున గోచరించుట. కనుకనిది మానసికము.

ఇంత వరకు పరిచయ ప్రస్తావన.

**3. సాక్షివివర్తము**

అజ్ఞానమును తన స్వాధీనము నందుంచుకుని దానివిధానము ను గుర్తెరింగియున్న అసంగుడు. అంటే విషమ సత్త యొక్క జ్ఞానము గలవాడు.

ఇక కొన్ని పదముల కర్థముల గ్రహింతము.

1 ఆవృతి = ఆవరణము; మరుగు
2 వివృతి = వివరణము; వెల్లడి

1 ఆవృతము = ఆవరించబడినట్టిది
2 వివర్తము = a) అధ్యాస (అజ్ఞానజన్యస్వరూపము)
b) ఆవరణ తొలిగినంతనే తాత్త్విక స్వరూపము స్వయంసిద్ధముగ ప్రకాశించి, ప్రకటమగుట.

వివర్తమవుతుంది : 1. భ్రాంతిజన్య జ్ఞానమువలనగాని, పరిసరముల ప్రభావమువల్లగాని (వెలుగు చీకటి etc) బాహ్యేంద్రియములగు నేత్ర శ్రోత్రాదులయందు లోపమువల్లగాని అంతరింద్రియమగు మనస్సునందలి మలినములవల్లగాని, ఒక వస్తువునందు మరొక విషమరూపము గోచరమగుటయే వివర్తమగుటయని సామాన్యముగ చెప్పబడుచున్నది ఇది ఆవరణ అతిశయించిన వారికిగాని, అలము కొన్నవారికిగాని, సంభవమగు నొక అనుభవము. ఈ ప్రక్రియలో అధిష్ఠాన పదార్థమునందెట్టి మార్పును గలుగకయే ఇది సంభవమగు చున్నందుననే వివర్తమనబడు చున్నది. అయినను అజ్ఞానియొక్క దృష్టికి తెలియబడునట్టిదైనందున ప్రమాతృ వివర్తమనబడుచున్నది. ఇది వస్త్వాశ్రయ (objective) దృష్టికి సంబంధించినది.

2. అజ్ఞానపుటావరణ తొలగినవారికి దృశ్యముయొక్క తాత్త్విక స్వరూపము సూక్ష్మరూపమున ప్రకటమగుటయే వివృతి. పదార్థము, తైజసుడు లేక హిరణ్యగర్భుడనువాని సాన్నిధ్యముచే ప్రభావితమైనప్పుడే సృష్టికార్యమునకు నాందియగును. ఈ హిరణ్యగర్భుని దర్శించగలవారే

జ్ఞానదృష్టితో తత్త్వదర్శనము చేయగలరు. ఇది x-rays వంటిది. దీని సాయముతో జడమగునొకతెర పైన చైతన్యముతోయున్న ఒకనిగుండె, ఊపిరితిత్తులు తమకు సహజమగు ప్రవృత్తితో చూడబడుచున్నవి. అట్లే పరిశుద్ధాంతః కరణముగల జ్ఞానికి ఆత్మాశ్రయ దృష్టిగలిగి భౌతికమును ప్రభావితము జేయు హిరణ్యగర్భ స్వరూపము, సామర్థ్యము ప్రాప్తించును.

ఆ పదార్థపు సహజ స్వరూపదర్శనమగును. ఇదియే సాక్షివివర్తము. ఇది ఆత్మాశ్రయ భావదృష్టి--Subjective aspect.

ఇక వివరణ :

ప్రమాతృ వివర్తము : ప్రమాతయన అంతఃకరణమునందు ప్రతిబింబించిన ప్రత్యక్ చైతన్యమే. ఇదే కూటస్థ చైతన్యము. నేను గ్రహించినంత మేరకు ఈ ప్రత్యక్చైతన్యమునకు మాత్రమే అధ్యాసభాష్యము నందు పేర్కొనబడిన అవిద్యయను భావము అన్వయించును ఈ సూక్ష్మమును గ్రహించినవారికి మాత్రమే తత్త్వశాస్త్ర బోధలు ఋజుభావముతో హృదయంగమము కాగలవు. ఏమన—ప్రత్యగాత్మయనబడు ప్రత్యక్చైతన్యమునకు ప్రాప్తించిన అధ్యాసను నివర్తింజేయుటకు మాత్రమే వేదాన్త శాస్త్రము ప్రవర్తించినది. ఇది గుర్తుంచుకొనవలసిన ఒక ముఖ్యవిషయము. ఈ సందర్భమున శంకరులు జెప్పిన అధ్యాసభాష్యవిషయము లిట్లున్నవి :—

"యుష్మదస్మత్ప్రత్యయగోచరయోఃవిషయవిషయిణోఃఇతరేతరభావో
అనుపపన్నః తథాపి నైసర్గికోఽయంలోకవ్యవహారః
అహంఇదంమమేదమితి" ॥

భావము : "నేను—నాది" అనెడు భావములు ఒకదానికొకటి అత్యంత భిన్నములైనను నేనును నాదిగను, నాది అనబడేదాన్ని నేనుగను భ్రమపడి

వ్యవహరించుట మన అనుభవము. శరీరమును నా శరీరమంటూనే యున్నాము కానీ నేను అనేటప్పుడు దానిని శరీరమునకే అన్వయించి చెప్పుచున్నాము.

కనుక ఆత్మయేదో అనాత్మఏదో గ్రహించలేక అంటే ఆత్మానాత్మ వివేకములేక ఒకదానికొకటిని పేర్కొని చెప్పుచున్నాము. This is due to the in ability to distinguish the Spirit from the matter. ఇట్టి భ్రాంతి జీవులకు సహజము. జీవుని ఆశ్రయించియున్న ఈ భ్రాంతిచే కలుగు విషమసత్తనే లేక భ్రాంతిజన్య దృశ్యమునే వివర్తమందుము. ఇది ప్రమాతకు చెందినది గనుక ప్రమాతృ వివర్తమని పరిభాషింపబడుచున్నది. వివర్తమనగా పరిణామము ప్రాప్తించకయే మారురూపము భాసించుట. ఈ మారురూపమునకే వివర్తవికారమనిపేరు. దీనిని పరిణామ వికారమునుండి ప్రత్యేకించి గుర్తించవలయును. పరిణామ ప్రక్రియయందు మార్పు పదార్థమునందు వాస్తవముగ జరుగును. వివర్త ప్రక్రియయందు మార్పు భావమునందే కలుగునుగాని పదార్థమునందుగాదు.

వివర్త వికారమన : మూల పదార్థమునందు (అధిష్ఠానమునందు) మార్పు లేశమైనను జరుగకయే దానిపై మనకు స్ఫూర్తినిచ్చు ఒక మారురూపము. దీనినే అధ్యారోపమందురు. ఉ॥ తాడు అసలువస్తువైయుండ కారణాంతరములచే ఆతాడునందు మనకు సర్పరూపస్ఫూర్తి కలుగుట; దొడ్డిలో నొకచోట నిర్జీవముగ నిలిపి యుంచిన దుంగయందు సంధ్యచీకటిలో నొక దొంగ రూపము స్ఫురించుట. ఇట్టి ఆభాసదృశ్యములనే వివర్తవికారములందురు. అధ్యారోపమన నిట్టిదే. ఇది ఒక తాడుపై ఒక పామును పరుండబెట్టుటగాదు, ఒక దుంగపై నొకదొంగను పరుండ బెట్టుటయుగాదు. చూడబడుచున్నదొక నిర్జీవపు దుంగయైయుండ, దానిని చూడగనే ఒక సజీవియగు దొంగరూపముయొక్క స్ఫురణగలుగుటయే అధ్యారోపము.

కనుకనిది భావరూప మాత్రమేయగుగాని వస్తురూపములకు చెందు నదిగాదు. కాగా ఈ వికారదృశ్యములకు కారణము అతాడునందో ఆదుంగ యందో యుండదు. వాటినిచూచువాని మనస్సునందు మాత్రమే యుండును. లేదా వెలుగునందలి మాంద్యమో, పరిసరముల ప్రభావమో కారణమగును. ఈ మారు రూపములు లేక రూపాంతరములు నిజమైనవిగావు. అందురాశి అనగా mass లేక పదార్థముండదు. కనుక నీ రూపాంతరములుప్రమాతకు సంభవించు 'భ్రాంతి స్వరూపములు. ఈ కల్పిత దృశ్యములు ప్రమాతృ వివర్తముచే సంభవించినవని చెప్పనగును.

సాక్షివివరము : సాక్షియననెట్టివాడు ?

తన సిద్ధాంతలేశ సంగ్రహమునందు వాచస్పతి మిశ్రుడు చెప్పినట్లుగ శ్రీ అప్పయ్య దీక్షితులవారిట్లు ఉదహరించిరి.

"సాక్షీనామజీవప్రవృత్తౌవృత్త్యనుమంత్రతయావ్యవస్థితఃపరమేశ్వరఏవ
ఏషఃఅవిద్యాంతఃకరణతద్ధర్మాది భాసకఃఏనంఅవిద్యానాఽఽవృణోతి
ఏతస్యఆనందోఽపిఅన్యావృతఏవ ఏతస్యఅహంకారాదిస్మరణేవృత్త్య
పేక్షనాఽస్తి ఏషఏవవృత్తిగోచరసకలగోచర
దృశ్యాఽధ్యాసాఽధిష్ఠానమ్ ఇతి॥

**భావము :** ప్రమాత అని చెప్పబడెడి జీవునియొక్క సకలవృత్తులకున్ను ద్రష్టగా నుండి అనుమతించుచు అతనిని ప్రవర్తింపజేసెడి ఈశ్వర చైతన్యమే 'సాక్షి'. ఈ సాక్షియందే ఈ ప్రమాత యొక్కస్థాయి అంతయును ఆరోపితమైయుండి మాయావికి తన మాయికప్రవృత్తి యంతయును స్వవిదితమై స్వాధీనమైయుండునట్లు ఈ సాక్షికి ప్రమాతయొక్క ప్రవృత్తి యంతయును స్వాధీనమైయుండును. ఇట్టి చైతన్యమే సాక్షి. ఈతనియందు

స్ఫూర్తియగు ప్రమాతయొక్క ప్రవృత్తియే సాక్షివివర్తము. ప్రత్యగాత్మ, సాక్షి, అధిష్ఠానము అనునవి పర్యాయపదములు. ప్రపంచమున్నంతవరకు మాత్రమే పరబ్రహ్మకు సాక్షిత్వముఅన్వయించును. ప్రపంచముప్రసక్తము గాని యడల అది నిర్గుణ చైతన్యమే—కైవల్యమే, జాగ్రత్స్వప్న సుషుప్తులయందలి ఆత్మభావమునకును సాక్షిభావము అన్వయించునుగాని_ తురీయమునందలి మాత్రము సాక్షిభావము అన్వయింపబడదు.

శ్రీ విద్యారణ్యస్వామి భావములను తన 'బ్రహ్మవిదాశీర్వచన వాక్యములు' అను గ్రంథమునుండి గ్రహించి మన విశ్వాసమును పాదుకొలుపుకొందము :

"వికారమంతరేణ స్వాత్మ్యస్తిం సకలజగత్ సాక్షాదవ్యవధానేన స్వరూపబోధేన ఈక్షతే పశ్యతీతి సాక్ష్యనుభవోమే సంయక్ భూయంతో" ఇతి॥

భావము : ప్రమాత్రాధ్యాస మంతయును సాక్షియందే స్వతంత్రముగ ఆరోపింపబడి దానివలన తన స్వరూపమునకే మాత్రమును భంగము కలుగక-తాను సచ్చిదానందఘనుడుగా నున్నాననెడి అనుభవమే సాక్షి వివర్తానుభూతి. ఇది తమనిదిధ్యాన, సమాధిస్థితులయందు బ్రహ్మవేత్తలకు మాత్రము సిద్ధించు అనుభూతి.

సాక్షియందుండెడిది స్వాధీనావిద్య. ఇది ఈశ్వరాధిష్ఠితమగుమాయ. ఆయన అధీనమునందున్నట్లని గ్రహించనగును. అందుననే సాక్షినటనా కౌశలుడని తెలిసికొనవలయును.

'నర్తకుని భంగిపెక్కుమూర్తులతోనెవ్వడాడు' అను భాగవత పద్యభాగము ఈ స్వాధీనా-విద్యభావమును వివరించి సాపించుచున్నది.

భ్రాంతి ఏకరూపమే. ఐనను ఈస్వాధీన అస్వాధీన భేదములవల్ల ప్రమాతృ వివర్తము, సాక్షివివర్తము. అను భేదములతో పరిభాషింపబడుచున్నది.

అధిష్ఠానము : తాత్కాలిక ఉనికిని పొందనగు ఒక దృశ్యమునకేగాని, దృశ్యపదార్థమునకేగాని మూలమై లేక ఆధారమై యుండే సత్యమగు పదార్థము. దృశ్యపదార్థములు (appearances) ఏకారణమున సంభవమైనను కారణమగుతనయందు ఎట్టిమార్పును ఎంతమాత్రము కలుగనట్టిదే అధిష్ఠానము.

ఇది కారణరూపమున నుండియు సర్వప్రాభవాధారమైయున్న సత్పదార్థముగనుక అవ్యక్తమనియు వ్యవహరింపబడుచున్నది.

అధ్యారోపము : ఒక సత్పదార్థముపైన కల్పితమై ఇంద్రియగోచరమగు తాత్కాలిక దృశ్యము. కనుకనేమిథ్య. తెరఅధిష్ఠానమైతే ఆతెరపై యున్నట్లు కనిపించు బొమ్మలు అధ్యారోపితములు. అధ్యారోపమన ఒక వస్తువుపైమరొక వస్తువును ఉంచుటకాదు; భ్రమచే మరొకరూపము దృశ్యమానమగుటయే.

సాక్షి : తాను చూడ సంభవమైన దృశ్యమునందలి సుఖదుఃఖములచే గాని అందలి కర్మలచేగాని సంబంధము పొందకయే, అది జరుగుచున్నది గనుక, ఎట్టి వైకల్యమును పొందకయే చూచుచుండు తత్త్వము. అంతఃకరణముతో కూడియున్న చైతన్యము మాత్రమే సాక్షికాగలదు. సాక్షి బుద్ధీంద్రియముల సాయమునపేక్షింపకయే స్వాఽవిద్యావృత్తిచే సాక్షాత్తుగ జీవచైతన్యచేష్టల చూచుచుండు ప్రత్యగాత్మయే. చిత్తవృత్తితోగూడిన చైతన్యమే సాక్షి. ఇచట దృశ్యమునందలి భావములతో తాదాత్మ్యము

కలుగదు. సాక్షీభావము కేవలనిర్గుణ బ్రహ్మకు వర్తించదు చిత్‌జడ సంయోగపూర్వకముగ జగత్తు ప్రవృత్తి పొందినప్పుడే సాక్షీప్రసక్త మగును. సాక్షి ఏట్టి చిత్తవృత్తులతోనూ తాదాత్మ్యము పొందదు. భావమునే గ్రహించునుగాని తాదాత్మ్యభావానుభూతి కలుగదు.

ప్రమాత : ప్రమయన జ్ఞానము. ఇంద్రియములద్వారా ప్రమను సముపార్జించుకొనువాడు ప్రమాత. ఉపాధిభేదముచేత వేర్పాటు (పృథక్) భావమును పొందిన చైతన్యవిశేషమే ప్రమాత. ఈతడంతఃకరణముతో కూడి యుండును.

అవభాసము : భ్రమజ్ఞానజన్య దృశ్యము; అధ్యాసము.

విలసనము : manifestation–అధిష్ఠాన పదార్థవిభూతి లేక శక్తి, మూర్తిమంతమగుటచే ప్రాప్తించును. ఇది పరిణామమువంటిదికాదు, భ్రాంతిజన్యజ్ఞానముచే ప్రాప్తించినదియుగాదు స్వతంత్రమే.

ఆధారము : దృశ్యప్రపంచ కల్పనకు అధారమగు సత్పదార్థము బొమ్మలకు తెరగుడ్డ వంటిది.

వివర్తము : ఒక పదార్థము తన సహజ స్వరూపమునందు లవలేశమైననూ మార్పు పొందకయే, భిన్నస్వరూప స్వభావములుగల మరొక వస్తువువలె భాసించుట. అంటే అధిష్ఠాన పదార్థపుసత్త ఒక విధముగనుండగా వివర్తరూపపుసత్త అందుకు భిన్నముగ తెలియబడుట. దీనినే విషమసత్త యందురు. (పరిణామమున కారణమగు అధిష్ఠానమునందును, కార్యమగు వస్తువయందును సమసత్తయే తెలియబడును.)

సమసత్తయన సాజాత్యముగల సత్త. ఇది గుర్తుంచుకొనవలసిన విషయము. అందుచే వివర్తమొక స్వతంత్ర సంఘటనయనవచ్చును.

ప్రధానమగు పై పదముల భావములను పరిశీలించితే తెలియబడు భావము లేవియన :—

1. పరిదృశ్యమానమగు ఈ ప్రపంచమంతటికిని అదృశ్యము అవ్యక్తము నగు స్వరూపమొకటిగలదనియు.

2. అదియే సర్వప్రాభవాధారయగు (అన్నిటి పుట్టుకకు కారణమగు) దివ్య పదార్థమనియు.

3. దానియందే స్థూలమగు దృశ్య జగత్తంతయు నామ రూపములతో భాసించుచున్నదనియు; ఐనను అధిష్ఠాన పదార్థము మాత్రము ఇంద్రియ గోచరముగాదనియు, ఎట్టిమార్పును పొందదనియు.

అధికరణము : ఒక అధ్యాయమునందలి ప్రకరణము; ఆశ్రయము లేక ఆధారము (Concrete noun)

అధికరణ్యము : ఇది abstract noun form of అధికరణ.

ముఖ్యసామానాధి కరణ్యము : రెండుభావములు ఒకే సమానమైన ఆశ్రయమును అధి'కరణమును' గలిగియుండుట. (eg) ఒకే శరీరమున రెండు కాళ్ళను రెండు చేతులను ఉంటవల్ల ఆ శరీరము వాటికిఆశ్రయము. కనుక కాళ్ళకూ చేతులకును సామానాధికరణ్యము చెప్పబడును.

కాగా ముఖ్యసామానాధికరణ్యం బాధసామానాధికరణ్యం అను మరి రెండు రూపములుగలవు. తనకు అధారమైయున్న ఆశ్రయముతో, అందున్న రెండు భావములకు సంబంధమెట్టిదని తెలుపును. వాటిని ఉంచి, వాటితో కలిపి అర్థమును గ్రహించుట ముఖ్యసామానాధి కరణ్యము. వాటినిత్రోసి పుచ్చి ఆవిషయముయొక్క భావమును గ్రహించుట బాధసామానాధి కరణ్యము.

Gist : ముఖ్యసామానాధికరణ్యముచే కార్యమునకు దానికారణమునకు ఆశ్రయము లేక అధిష్ఠానము ఒకటేననుట. (Inductive View) అంటే ఆధారము ఆధేయము అనురెంటిని ముఖ్యముగ భావించి అందలి తాత్పర్యమును గ్రహించుట. (ఇది విశిష్టాద్వైత భావకారకము). కార్యము యొక్క ఉనికిని త్రోసిపుచ్చి (బాధించి) కారణపుటునికిని మాత్రమే నిత్య సత్యమని నిర్ణయించుట బాధసామానాధికరణ్య ప్రక్రియ. ఇది అద్వైత సిద్ధాంతమును చేయుటకను కూలించును.

బ్రహ్మ, వివర్తవిధానమున ఎందుచేత అభివ్యక్తమగు చున్నాడు? అను శంకకు అది ఆయన స్వభావమని ఏకైక సమాధానమునిత్తురు కొందరు పండితులు. అది ఆయన లీల అందురు మరికొందరు. లీలయన ఉల్లాస కారక క్రీడ. సర్వకామావాప్తిపొంది నిష్క్రియుడైన పరమాత్మకు ఏదో చేయ ఒక సంకల్పము కలగటం, అది ఆయన స్వభావం అనటం, అది ఆయన ఉల్లాసము కొరకే ఆక్రీడ అనటం తర్క దృష్టికి సమంజసము గాదేమో. బుద్ధిమంతులు ఆలోచింతురుగాక! అసలు "సోకామయత బహుస్యాం ప్రజాయేయ" అను వాక్యభావమేమి? క్రీడించి ఆనందించు టకు బహురూపముల నొందుదునుగాక! అనియేనా? పరబ్రహ్మమునకు క్రీడతో పొందదగిన ఆనందము మరొకటి కలదా? కానిచో ఆ నిర్గుణ

మూర్తికి ఈ దుర్గుణమేల కలుగవలెను ? లేదు ఇది మాయాశబలితుడగు ఈశ్వరునికి పుట్టినబుద్ధి అందురు ? ఈ ఈశ్వరుని సృష్టించినదెందుకేనా ? ఇట్టి శంకలను బహిరంగముగ అడిగినయడల ఈ భావములు సామాన్యులకు బోధచేయుటకుద్దేశింపబడినవందురు. శాస్త్రము మాన్యులకొకవిధముగను సామాన్యులకొకవిధముగను బోధింపనగునా ?

వివర్తప్రక్రియా విధానమును పరిశీలించునప్పుడు వివర్తమన 'మార్పు' అను సాధారణ వివరణా విధానముగాక 'ప్రకటమగుట' అను అర్థమును గ్రహించుటయందును ఔచిత్యమున్నట్లు తెలియుచున్నది.

ఏలనన :— మూలపదార్థమునందు మార్పు లేకయే నూత్నదృశ్యము భాసించుట చేతను మూల పదార్థపు సత్తకంటె భిన్నమగు విషమ సత్త (Hetrogenous) ప్రకటమై గోచరించుట చేతను ద్రష్టకు అవిద్యతొలగినంతనే ఆ దృశ్యమునకు మూలమగు అధిష్ఠానపదార్థము తనకు తానై ప్రకటమగుటవల్లను, 'ప్రకటమగుట' అను అర్థమున్న సముచితముగనున్నది. ఈ రెంటిని మరికొంత విశేషించి వివరింతును. అంటే అవిద్యతో కూడియున్న ప్రమాతకు గోచరమగునది ఒక విధము. దీనిని ప్రమాతృవివర్తమందురు.

అవిద్యతొలగినవారు దేహధారులైననూ, వారుసాక్షిమాత్రులగుటచే, వారికి ప్రకటమగు సూక్ష్మ స్వరూపము మరొకటి. ఇందు మొదటిదాని యందనృత దృశ్యము (మిథ్య) గోచరము కాగా, రెండవదానియందు సత్యమగు, స్వరూపలక్షణములు ప్రకటమగుటయే విశేషమను టగ్రాహ్యాంశము. ఇదియే సాక్షి వివర్తము.

ఇంతవరకును విచారణ సాహిత్యపరముగా జరిపితిమి అనగా పారిభాషికపదములు వాటిభావములను గ్రహించితిమి. ఇదిశాస్త్రవిషయముల గ్రహింప సహకరించును.

## ఇక శాస్త్రి దృష్టితో

### వివర్తమెట్లు వివరింపబడినదో గ్రహింతము

"వివృతం బ్రహ్మజగద్రూపేణ ఇతి వివర్తమ్॥"

వివర్తము అనిర్వచనీయమని పేర్కొనబడుచున్నను, పై వాక్యము ఒక 'నిర్వచనము'గానే పరిగణింపదగియున్నది. బ్రహ్మజగద్రూపమున ప్రకటమగుటయే వివర్తము అనిగదా యీ వాక్యభావము. ఇదివ్యుత్పత్తి పూర్వకమగు అర్థము. బ్రహ్మ ప్రమాతకు అజ్ఞాన పరిణామపూర్వకమగు జగత్తుగ వివర్తమైనను, సాక్షిమాత్రుడగు అవిద్యారహితునకు స్వరూప లక్షణములే ప్రకటముగా వచ్చునుగనుక సాక్షివివర్తమునను సమసత్తయే అభివ్యక్తముగావచ్చును. కాని ఇది పరిణామవిధానములో ప్రాప్తించు సమసత్తగాదు.

పరిణామ ప్రక్రియలో కార్యకారణములు రెంటియందును సత్త (స్వభావ స్వరూపముల ఉనికి) సాజాత్యమైనట్టిదై యుండును. వివర్తమున కారణము బ్రహ్మ. ఈనసత్త సత్యము; నిత్యము, ఆనందము అగును. కార్యమగు జగత్తునందును బ్రహ్మసత్తయే స్ఫూర్తినిచ్చును. కాని ఇచట స్ఫూర్తిమాత్రమే లభ్యము. సత్తమిథ్యా (Impermanence) పూర్వతీమైనది. అంటే నిత్యసత్యమైనదిగాదు.

కనుక వివర్తమునందలి సత్త విషమసత్త అని ఒక కొండ గురుగ జేసికొనవలయును. బ్రహ్మసత్తపారమార్థిక సత్తయు జగత్సత్త వ్యావహారిక మనియును గుర్తుంచుకొనవలెను.

"వివృతంబ్రహ్మజగద్రూపేణ" అనుటలో బ్రహ్మఐచ్ఛికముగను స్వతంత్రముగను జగద్రూపమున ప్రకటమయ్యెననిగదా భావము! ప్రకట మగుట ఎట్లనిన, ఆవిష్కరణము పొందియేనని తెలియబడుచున్నది. ఆవిష్కరణ (మూర్తిమంతమగుట) పొందేది బ్రహ్మయొక్క శక్తియే గాని ఆయన స్వరూపముగాదు అనుసునిశిత భావమును కొందరు తాత్వికులు చెప్పుచున్నారు. వారేశాక్తేయులు.

వీరి సిద్ధాంతము శాక్తేయము (Energy Deity) ఇందు కుండలినీశక్తికి చాలా ప్రాముఖ్యము గలదు. ఈ శక్తి పామువలెగట్టిగా చుట్ట చుట్టుకుని యుండుననియు, ఇందుకు మూలాధారచక్రమునుండి సహస్రారము వరకుగల షట్చక్రములయందు నిహితమైయున్న శక్తిని ఒక అనుక్రమముగ ఉత్తేజపరచుచు సహస్రారమువరకు సాగిపోయినవారికి సిద్ధియే ప్రాప్తించుననియు సిద్ధాంతము. ఈఆవిష్కరణసిద్ధాంతమును The theory of manifestation అందురు. స్వతంత్రాధ్యారోపమే యీ ఆవిష్కరణకు మూలము.

సుప్రసిద్ధ ఆగమశాస్త్రపరిశోధకుడు భారతీయ ఆగమ శాస్త్రవేత్తయు నగు 'సర్‌జాన్‌ఉడ్రఫీ' (కలముపేరు ఆర్థర్ ఎవలాన్) అను ఆంగ్ల ఆచార్యుని అభిప్రాయమున్ను ఈ ఆవిష్కరణ భావమునే బలపరచు చున్నది, వీరు కలకత్తా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగ ఉద్యోగ విరమణజేసియున్న ఆంగ్లేయుడు. యజ్ఞోపవీతధారియగుట ఒక విశిష్టత.

ఆవిష్కారణ ప్రక్రియ శైవ, శాక్త, విశిష్టాద్వైతులచే మన్నింపబడు చున్నది. కొందరు ఆవిష్కారణకూడ పరిణామ ప్రక్రియాంతర్గత భావమేనందు ఆవిష్కారణ ఆదిశక్తి వలన సంభవ మగుననియు, పరిణామము పరా—అపరప్రకృతులకే పరిమితమనియు నా భావము. శైవశాక్తేయులకు శక్తి స్వతంత్రప్రజ్ఞగలదని విశ్వాసముకాగా, అద్వైతులు మాయాశక్తి మాత్రము అస్వతంత్రమైనట్టిదనియు అందురు.

(గీత 9-10) లో 'మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతేసచరాచరామ్" అను శ్లోకమున-నిర్వికారుడనగుటచే అధిష్ఠింపబడి త్రిగుణాత్మక యగు అవిద్యచరాచరములతో గూడిన ప్రపంచమును సృష్టించుచున్నది అనియు అందుచేతనే శక్తి అస్వతంత్రమైనట్టిదనియు చెప్పుదురు అద్వైతులు. కానీ శక్తి సంసర్గములేనిదే శివుడు ఏపనినిజేయుటకును సమర్థుడుగాజాలడని శైవశాక్తతత్త్వవేత్తలు నిర్ధారించి తెలుపుదురు.

"శివశ్శక్త్యాయుక్తః యదిభవతిశక్తః ప్రభవితుం" అను (సౌం॥ల॥) శ్లోక భావమున్నూ శక్తి సంసర్గము లేనిదే శివుడు ఏపనిని జేయుటకైనను సమర్థుడు కాజాలడను భావమునే పుష్టిపరుచుచున్నది. వివర్తపదభావము గురూపదేశశాస్త్రజ్ఞానములచే అధిష్ఠానపదార్థపు తాత్త్విక రూపముపలబ్ధమైన వారికిగాక అన్యులకు సుగ్రాహ్యముకాజాలదు. అన్యులనగా కేవలదేహాత్మ భావమునేగలిగి జీవధర్మప్రభావితులైయున్న కర్మిష్ఠులని భావము. అట్టివారికి బ్రహ్మసత్యం-జగన్మిథ్యయనిగాక 'జగత్‌సత్యంమార్పు నిత్యం' (The challenge of change ever exists in matter and therefore matter is indestructible and the world is an apparent truth. అను దృక్కోణపు బోధయే అభివ్యక్తము ఆదరణీయమునగును.

ఈ సందర్భంలో ఒక సూక్ష్మము గ్రహింపదగియున్నది. ఏమన— పైన 'వివృతం బ్రహ్మజగద్రూపేణ' అని చెప్పిన విధమునగాక-నీ అజ్ఞానము వల్ల బ్రహ్మ జగద్రూపమున దృశ్యమానమగుచున్నదనుటచే, వివర్త భావమునందు భేదభావములు రెండు సంభవమగుచున్నవి. అందు మొదటిది ఆత్మాశ్రయ దృష్టి రెండవది ఏకోణము నుండి చూచిన తెలియబడునది objective view (వస్త్వాశ్రయదృష్టి) ఈ భేదదృష్టికి కారణములు 1. అసంభావన 2. విపరీతభావన అనబడు అజ్ఞానసంజనిత భావములే. ఇవి రజస్తమోగుణ శక్తులచే కలుగునట్టివి గనుక గుణపరిణామ కార్యములకు అన్వయించ అవకాశమున్నదిగాని వివర్త పరిణామమునకు అన్వయింపబడజాలవు. అనగా అసంభావన విపరీత భావనలు ప్రమాతకు సంబంధించినవిగాని, సాక్షికి సంబంధించినవిగావు

ఇందుచే వివర్త మనునది రెండు విధముల దెలియవచ్చుచున్నది. ఒకటి : ప్రమాతృ వివర్తము. ఇందు అజ్ఞానకారక అంశముల ప్రాబల్యము వలన బ్రహ్మను బ్రహ్మగ దెలియలేక పోవుట జరుగును. రెండవది. బ్రహ్మమే జగద్రూపమున, స్వయముగా, స్వతంత్రముగ, ఐచ్ఛికముగ ప్రకటమైనట్లు తెలియుట. అనగా దృశ్యమానమంతయు బ్రహ్మమేనని సంభావించుట. ఈ జ్ఞానముచే ప్రాప్తించుభావమే సాక్షివివర్తమనబడుదాని యందలి ఆంతరంగికబోధ, ఈ సూత్రము విశ్వసనీయముగ హృదయమున హత్తుకున్నవారికి మాత్రమే తరువాత సిద్ధించుకొనవగు అనుభూతి ప్రాప్తించుట సంభవము. ఆసిద్ధియే కైవల్యము

ఇక ప్రమాతృ వివర్తమునకు కారణభూతములగు అసంభావన విపరీత భావనలనబడు అంశముల పరిశీలింతము. అసంభావన అనగా బ్రహ్మమును యథాతథముగ గ్రహించి తెలిసికొనలేకపోవుట. విపరీత

భావన అనగా సహజము సత్యము నైయున్న స్వరూపమునందు ఒక భిన్న విషమ స్వరూపము నారోపించుకుని (attribute) అదియే దాని నిజ స్వరూపమని సంభావించి విశ్వసించుట. ఇందు మొదటిది ఇంజన్ లేనిరైలు బండి (తత్త్వవివేకములేనిమూతబడినదృష్టి). రెండవది ఇంజన్ పాయింటు తప్పినందున పెడమార్గము పట్టిన రైలుబండి (విక్షేపశక్తివల్ల కలిగిన అన్యధాభావము). ఈ రెండును ప్రమాతృ వివర్తమునకు సంబంధించి నవియే. ప్రమాతయన ఇంద్రియ సంపాదిత జ్ఞానమే సత్యమని విశ్వసించు అవిద్యాశబలిత జీవుడు. ప్రమాత అనుభూతిని పొందుట ఇంద్రియ సముపార్జిత జ్ఞానముమాత్రమేగాక బుద్ధీంద్రియమునందు సంభవమగు భ్రమపూర్వక జ్ఞానమున్నుచేరి అసంబద్ధమగు దృశ్యములను ఉపలబ్దమగుచుండును.

ఇట్టి దృశ్యములను ఆంగ్లమున ఇల్యూషన్ (Illusion) అని వ్యవహరింపబడుచున్నది. ఈ పదము జగత్కు ఎంతవరకు అనువర్తనీయమో పరిశీలింతము. ఎట్లన :-- భ్రాంతి జ్ఞానమునకు కారణము చిత్తమునందున్నది. The cause for an illusion is in the mind with out the right perspective or in a mind which is morbid; where as the cause for a change in the actual shape is inherent in mass or substance, due to the intrinsic vibrations and the consequent development of antagonis tic forces as anabolisom and ketabolism in its substance.

This has to he discriminaled and the issues remembered to aid our further investigations and dilectics.

భ్రాంతి జ్ఞానమునకు (illusion) కారణము. మనోగతమై యున్నందునను, దానిచే ప్రాప్తించు దృశ్యమునందు రాశియనునది అసంభావ్యమనియు. ఒక వస్తువునందుమార్పు దృగ్గోచరమగుటకు అధిభౌతిక

పదార్థమైయుండిననే సంభవమగుననియు తెలియుచున్నది. ఇక మానసికలోకమున చిత్తవృత్తులయందు మార్పులు సంభవమేఅయియున్నను అవి ఇంద్రియ గోచరములగుటకు శబ్దస్పర్శరూపాదులకు అందనివవి గుర్తించుకొన్నయెడల విచారణా సౌలభ్యము కలుగును.

ఇంతవరకును వివర్తప్రక్రియను గురించినసామాన్య జ్ఞానము: విశేష జ్ఞానము కొరకు కొన్ని సూక్తులను పరిశీలింతము. ప్రధాన సూత్రము :

I "కారణంపరమంసత్యం-కార్యం వై వ్యావహారికంకారణంనిత్యసత్యము-కార్యము వ్యావహారికసత్యము"

భ్రాంతిజ్ఞానము చిత్తము అనబడు సూక్ష్మాతి సూక్ష్మమగు పదార్థమున సంభవమగుటవలన ప్రాకృతమనియే చెప్పవలసియున్నది. కానీ, దృశ్యప్రపంచమునకు ఉపాదానకారణమైన స్థూలభూతముల సంకలనము వలన నిర్మాణమైన పదార్థమువలె, ఇది ఇంద్రియగోచరముగాదే! మరి ఈ జగత్తును భ్రాంతి జ్ఞానముచే కలిగిన రాశిరూపమగు నామరూపములుగ విశ్వసించుటెట్లు? ఇది మనము పరిశీలించి అవగాహనకు తెచ్చుకొనవలసిన ప్రధానాంశము. యత్నింతము. ఇపుడు వివర్తమును గురించిన మరికొన్ని సూక్తుల పరిశీలింతము.

II "వివర్తోనామ ఉపాదాన విషమసత్తాకకార్యాపత్తిః"

భావము : ఉపాదానము అనగా మూలపదార్థమునందలి సత్తకన్న భిన్నమగు సత్తగలిగిన పదార్థము, పరిణామమువలన సంభవమైనయెడల అందలి భిన్నమగు సత్తయే విషమసత్త. అదియే అధ్యారోపిత పదార్థమని చెప్పబడుచున్నది. ఈ సందర్భములో మన పరిశీలనకు ప్రధానమగు

పదార్థములు రెండు. ఆ రెంటిని తెలిసికొన్నయెడల సర్వమును సుగ్రాహ్య మైనట్టేనందురుగదా! అవి పారమార్థిక పదార్థమగు ఆత్మ, భౌతికమగు జగత్తున్ను. Spirit and matter. ఈ రెంటి సత్తలయందలి భేదమును గ్రహించనిదే వివర్తప్రక్రియ తెలియబడదు. కనుక విచారింతము;

1. బ్రహ్మసత్త : సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. దీని లక్షణములు— అనంతత్వము. నిష్క్రియత్వము, నిత్యసత్యత్వము, ఆనందము, జ్ఞానమునై యున్నట్టిది.

2. పదార్థసత్త (జగత్‌సత్త) : సాంతము, పరిచ్ఛిన్నము, అసత్ (impermanence) జడము (Inanimate) అను లక్షణములు గలది. ఇది వ్యావహారిక సత్యమేగాని నిత్యసత్యముగాదు. ఇట్టి విరుద్ధ లక్షణముల సంపుటియే విషమసత్త. కనుక వివర్తమన—అసలుసత్త బ్రహ్మసత్తయే యైనను అది తన సహజసత్తయందెట్టిమార్పును పొందకయే విషమసత్త వలెగోచరించుటని తెలియుచున్నది. ఇట్లు గోచరించున దెవ్వరికన— ఇంద్రియజ్ఞానమును విశ్వసించు ప్రమాతకు మాత్రమేనని సిద్ధించుచున్నది. దీనికే ప్రమాతృ వివర్తమని పేరు.

బ్రహ్మసత్తకు భిన్నమగు సత్తను ప్రదర్శించునది ప్రకృతి. బ్రహ్మ సత్తను అనుభూతికి తెచ్చుకొనినవారికి, ఆ ఆధారము తెలియబడక దానియందు ఈ ప్రకృతిసత్త (విషమసత్త) మాత్రము గోచరమై అను భూతిచ్చుటయే అధ్యారోపమను పదముయొక్క భావము. ప్రకృతి సదా పరిణమించుచు మార్పులబొందు చుండుటచేత విషమసత్తగలది అని అనబడుచున్నది. విషమసత్తకుకారణము అజ్ఞానముగనుక అదిజ్ఞానముచే నశించునని చెప్పబడుచున్నది. అనగా పదార్థము స్వరూపనాశముపొందక

పోయినను, జ్ఞానికి అట్టి విషమసత్తయు బ్రహ్మసత్తగ గోచరించుచే సాక్షివివర్తము. అజ్ఞానికి ఈసాక్షి వివర్తభావము దుర్గ్రాహ్యమేయగును. జ్ఞానికి బ్రహ్మసత్తయందు విషమసత్త అధ్యారోపితమై గోచరించుచున్నా విషమసత్తకూడ బ్రహ్మసత్తగనేసుగ్రాహ్యమై 'బ్రహ్మసత్యం-జగద్బ్రహ్మ' అను అనుభూతి కలుగుటయే సాక్షివివర్తమునందలి సూక్ష్మభావవిశిష్టత.

అంతియేగాని ప్రకృతికినాశమును జెప్పువారు బ్రహ్మకును స్వరూప నాశమునంగీకరించినట్లేయగును. ఏలనన — బ్రహ్మమునకును ఆయన సహజప్రకృతికిని, చంద్ర చంద్రికలకువలె, అవినాభావసంబంధమున్నది గనుక. ఆరెండును అద్వయమిధునభావముతో నుండునని తెలియవలెను (The indivisible Spouse) ఇదియే అర్ధనారీశ్వరతత్వము.

గ్రాహ్యాంశము : "సర్వంఖల్విదంబ్రహ్మతజ్జలానితి" అనుసూక్తి సత్యమేయై యున్నను. ఆసర్వమునుజూచుచు జీవదృష్టి, దివ్యదృష్టిఅను దృష్టిభేదముల చేత బ్రహ్మసత్తయందు విషమసత్తను (అధ్యారోపితముగ) విషమసత్త యందు బ్రహ్మసత్త (అంతర్యామిగ) అనుభూతి నిచ్చును, ఇందుమొదటిది ప్రమాతృ వివర్తము రెండవది సాక్షి వివర్తమనియు వ్యవహరింపబడు చున్నది. కనుక జ్ఞానికి "బ్రహ్మసత్యం--జగద్బ్రహ్మ" కాగా, ప్రమాతకు "మాద్బ నిత్యం—జగత్తు సత్యమగును.

III "నవనవోన్మేషశాలినీ ప్రతిభ వివర్తం. ప్రతిభబుద్ధికేగాక శక్తికిని సంబంధించినది. చిత్తముయొక్క శక్తి ఎట్టిదన— భిన్నభిన్న రూపములుగల వస్తువులనుచూచి ఆయావస్త్వాకారములబొంది ఆ వస్తువులతో సంసర్గము పొందును. అట్లు రూపాంతరముల బొందుట (వృత్తులబొందుట) చిత్తము

యొక్క ధర్మము. కాగా ఈవస్త్వాకారములన చిత్తవృత్తివక్రమగుటయు సంభవమగును.

నేలపై ఒకతాడు ఉన్నదనుకొందము. అదిసంధ్యాసమయము. ఆసంధ్య చీకటి ప్రభావముచే అతాడు ఒకపామువలె స్ఫురింపవచ్చును. లేదా ఆచూచువానికి దృష్టిదోషమున్నను ఆతాడు పాముగా భావించవచ్చు, చిత్తము అప్పుడు అపాము ఆకారమును బొందును. ఇప్పుడు తాడు పామువలెకనబడుటే ప్రమాతృ వివర్తమునకు ఉదాహరణము.

ఈ సందర్భమున గ్రహించవలసిన ఒక సూక్ష్మమేమన-- ఇది చిత్తవికారమునకు అందుచే ప్రాప్తించిన చిత్తవృత్తికిని సంబంధించినది గాని, చూడబడుచున్న పదార్థమునకు సంబంధించినదిగాదు ఇచ్చట పరిణామము ప్రాప్తించినది పదార్థమునకుగాదు, చిత్తమునకు దానికి సంబంధించిన అజ్ఞానమునకు మాత్రమే.

నవనవోన్మేషమనగా, కొత్తగా, క్రొంగ్రొత్తగా మార్పులవలన సంభవమగు రూపములు గుణపరిణామమునకే వర్తించునుగాని వివర పరిణామమునకుగాదు వివర పరిణామము రాశికి (mass) సంబంధించిన దగుచో, జగత్తు రాశిరూపమునసుండుట సంభవముగానేరదు. వివర్తముచే పదార్థమువలె స్ఫూర్తినిచ్చు ఆకారమును, ఒకఘనపదార్థమునువలెకాల్చియో, రంపముతో కోశియో, ఉలితో అంటించియో మార్పులు కలుగజేయుట కవకాశముండదు.

జగతులో కర్రను రంపముతో కోశియు, ఇనుమును నిప్పునందు కాల్చి సుత్తెతోకొట్టియు రూపాంతరముల గల్పించుచున్నాముగదా! మరి భ్రాంతి జ్ఞానముచేత జగన్నిర్మాణము జరిగినయెడల అంటే భ్రాంతిజ్ఞానమే ఒక దూలముగనో. ఒక ఇనుపకమ్మిగనో రూపొందినయెడల ఆ జగత్తున్ను

మనకు దృశ్యమానమగుచున్న జగత్తువలెరాశిరూపమునసేయుండి అందలి వస్తువులను అగ్నియందుకాల్చియు సుత్తెలతోకొట్టియు. ఉలితోచెక్కియు మన ఇచ్ఛానుసారమగు చిత్రములు? చిత్రకళల సృష్టి పసవకశముండునా? లేదా! ఈ భావమునే హేతువాదులు కొల్లగొట్టుచు తమ వాదముల సమర్థించి నిర్ధారించుకొనుచున్నారు.

జగత్తునకు అజ్ఞానము కారణమందురా? అంగీకారయే. కాని అజ్ఞానమననేమందురా? జ్ఞానముయొక్క అభావమనిగాక—రజోగుణము విక్షేపశక్తియు తమోగుణముయొక్క ఆవరణశక్తియు అని సంభావించిన—త్రిగుణాత్మికయగు ఈ జగమునందలి పదార్థములను అగ్ని, సుత్తెలు రంపములు మున్నగువాటితో రూపులమార్చి కళాత్మకముగ పునస్సృష్టి జేయసాధ్యపడును లేదా, స్వంతఉపయోగమునకు గృహము, గృహోపకరణములుగను రూపొందించుకొనుటకై అవకాశముండదు.

IV "జీవాశ్రితమాయావిషయీకృతం బ్రహ్మస్వతయేవజాడ్యాశ్రయ ప్రపంచాకారేణ వివర్తమానతయా ఉపాదానమిత్యాహుః"

సిద్ధాంతలేశసంగ్రహమున వాచస్పతి మిశ్రుని అభిప్రాయముగ అప్పయ్య దీక్షితులు సూచించెను.

భావము : జీవుని ఆశ్రయించియున్న మాయకు విషయీభూతమైనదిగనుక బ్రహ్మ ఉపాదానమై ప్రపంచరూపములో వివర్తమయ్యెనుఅని. జీవాశ్రిత మాయయే అవిద్య. అవిద్యయన అజ్ఞానకారకసామాగ్రి. ఈ అవిదశ తొలిగితే జీవుడు బ్రహ్మమునకు అభిన్నుడేగదా! కనుక నీయందు జీవ భావమున్నంతవరకు కర్మోపాసనలు చేయవలసినదే. కర్తృత్వభోక్తృత్వ ములు పోతే జగత్తులేదు. పరిణామములేదు. జడపదార్థమునకు ఆశ్రయ

మైన ప్రపంచరూపమున వివర్తపరిణామము చెందుటవలన మాత్రమే బ్రహ్మ ఉపాదానముగ ప్రసక్తమయ్యెను. ఇచట వివర్తమను పదమురాశికే వర్తించుచున్నది. అంటే అజ్ఞానమువల్లరాశియు సంభవమగునట్లు సూచితమగుచున్నది.

ఇక వివర్తవాద విచారణకు ప్రయోజనమెట్టిది ?

అద్వైతబ్రహ్మవాదమను శాఙ్కరాద్వైత సిద్ధాంతమునకు ఈ వివర్తవాద వివేకమే ప్రముఖసాధనముగ నుపకరించుచున్నది. బాధసామానాధికరణ్యము దృష్టితో కాఠిణమగు బ్రహ్మము సత్యముగనుక ఉపాదేయమనియు మిథ్యాభావముతో పరిగణింపబడుచున్న జగత్తు వ్యావహారికమాత్ర సత్తగలిగినదగుటచే హేయమనియు గ్రహించుట.

II. హిరణ్యగర్భస్థాయినందలి సూక్ష్మపదార్థపుటునికిని, ప్రవృత్తిని అవగాహనపొంది, చరమస్థాయిదగు అనుభూతికి అయత్తమగుటయు వివర్తశాస్త్ర విజ్ఞానమునకు ప్రయోజనములు.

ఈ వాదమునకు విస్తృతప్రచారమెప్పుడు లభించినదన—భారతదేశమున బౌద్ధమతము విస్తరించి వైదికమతసిద్ధాంతము అస్తవ్యస్తమగుచున్న కాలమున ఆదిశంకరులవతరించి వైదికవిజ్ఞానమును పునరుద్ధరించిరి. వీరు అభిమానించి ప్రవచించినది జీవబ్రహ్మైక్య పూర్వకమగు అద్వైత సిద్ధాంతము. దీనిని శాఙ్కరాద్వైత మందురు. ఎందువల్లననగా అద్వైతమునందును భిన్నభిన్న ఆచార్యుల మనస్తత్వములు వారివారి జీవధర్మములు ఆలోచనాసరణులననుసరించి శాఖాభేదములు తలెత్తకపోవలేదు.

అవి :-

1. రామానుజునివిశిష్టాద్వైతము
2. వల్లభాచార్యుని శుద్ధాద్వైతము
3. నింబార్కుని ద్వైతాద్వైతము
4. భట్టభాస్కరుని భేదాఽభేదవాదము
5. శ్రీ కంఠాచార్యుని శివాద్వైతము మున్నగునవి

వేదములు మూలగ్రంథములగు ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు అందరాచార్యులకు సామాన్యముగ అంకీకారములైనను. బోధకునకు బోధకునకును వివరణయందు అభిప్రాయభేదములుండుటవలన హిందూ మతము సంకీర్ణముగగన్పట్టుచున్నది. ఆచార్యునకొక్కొక్క అభిప్రాయము మనిషికొక మతముగనున్నది. మనకు ప్రకృతముశాఙ్కరాద్వైతము. దీనిని గ్రహించుటకుముందు జగద్విషయక విజ్ఞానమును పొందయత్నింతము.

## జగన్నిర్మాణ విధానములు

♦ మరికొన్నింటిని పరిశీలింతము ♦

కారణమనునదొకటి లేకయే ఈ ప్రపంచమున కార్యమనునది సంభవముగాజాలదు. అసలు ఈ ప్రపంచమే ఒక కార్యం అనగా సంభవ మగునొక పదార్థము. దాని రూపములును. ఇదే జగత్తు

దీని విషయమున పొందదగు వివేకమెట్టిదన—

1. ఈ ప్రపంచము రూపొందుటకుగల మూలకారణమేది ?
2. అది కార్యమగు ఈ జగత్తుకు భిన్నమైనదా ? ఏకరూపమా ?

అనగా సజాతీయమా విజాతీయయా ? అంటే ఈ కార్యకారణములకు అభేదమా ? అనన్యతయా ? లేక స్వగత భేదముగలిగియున్న ఏకైక పదార్థమా ? ఈ విషయముల గ్రహించుటకే సృష్టికార్యబోధకము లైన వివిధవాదములు, భిన్నభిన్న దర్శనములు ప్రసక్తములైనవి. కానీ I కపిలుని సాంఖ్య దర్శనము II సురేశ్వరాచార్యుని పంచీకరణ వార్తికము III పైంగలోపనిషత్ అను గ్రంథములయందు పేర్కొనబడిన విధానములు పరస్పరాంగీకారభావములతో మాన్యములుగనున్నవి. 'ద్వాదశమణి మంజరి' అనునా గ్రంథమున సృష్టకార్యవివరణకు పైంగలోపనిషత్‌నే ప్రధానముగ గ్రహించితిని మరియు శ్రీ సురేశ్వరాచార్యుల శిష్యుడగు సర్వజ్ఞాత్మమునిచే వ్రాయబడిన సూత్రకారికావ్యాఖ్యానము అను గ్రంథమున 2వ అధ్యాయమునగల కారికలు 57 to 61 వరకును పరిశీలించిన ప్రయోజనము పొందనగును.

కారిక 57

ఆరంభ సంహతి వికారవాదాన్।
నాశ్రిత్యవాది జనతాఖిలువావదీతి।
ఆరంభసంహతిమతే పరిహృత్యవాదౌ।
ద్వావత్ర సంగ్రహపదంనయతేమునీంద్రా ॥

భావము : వాదస్వభావముగల పండిత జనసమూహము. ఆరంభవాదము, సంహతి వాదము, వికారవాదము, వివర్తవాదము అనువాటిని ఆశ్రయించి వివరించుచున్నారుగదా! ఓ మునీంద్రా ! వీనిలో తొలిదగు ఆరంభవాదాన్ని, మలిదగు సంహతివాదాన్ని విడిచినయెడల మిగిలిన రెండువాదములే సంగ్రహింపదగిన పదవిని అందుకొనుచున్నవి.

కారిక 58 తత్రాపిపూర్వము పగమ్య వికారవాదం।
భోక్త్రాదిసూత్రమవతార్య విరోధను త్త్యై।
ప్రావర్తత: వ్యవహృతే పరిరక్షణాయ।
కర్మాదిగోచరవిధౌ ఉపయోగహేతో॥

భావము : అందునను వికారవాదాన్ని ముందు ఆదరించి భోక్త్రాది సూత్రాన్ని అవతరింపజేసి. విరోధపరిహారము కొరకు—వ్యవహారపరిరక్షణ కోసమున్ను, కర్మాధికమందు గోచరమగు విధియందు ఉపయోగమవునన్న కారణముతోనున్ను వివర్తవాదము ప్రవర్తింపజేయబడినది. సూత్రం :

భోక్త్రాపత్తేఃఅవిభాగఃచేత్ స్యాత్‌లోకవత్ (అ 2-పా1-14)

కారిక 59 సాక్షాదిహాభిమతమేవ వివర్తవాదం।
ఆహత్యసూచయతి పూర్వము పేక్షమాణః।
ఆరంభణాదివచనేన వివర్తవాదం।
శక్నోతివక్తుముదితే పరిణామవాదే॥

భావము : ఇచ్చట మొత్తముమీద పూర్వవికారవాదమునుపేక్షించినవాడై వివర్తవాదము సాక్షాత్తుగా తనకభిమతమేయని బాదరాయణుడు సూచించుచునేయున్నాడు. పరిణామవాదం సుసిద్ధమైతే ఆరంభణాది వచనముచేత వివర వాదం చెప్పశక్యముకాగలదు. సూత్రం : తదనన్యత్వమారంభణ శబ్దాదిభ్యః (2-1-14) వాచారంభణమేగాని వికారములు నామరూపములు వేరుగలేవు. ప్రకృతియు పరమాత్మకన్న భిన్నముగాదు.

కారిక 60 అదుహ్యభూమిమధరాంఇతరాధిరోధూం।
శక్నోతిశాస్త్రమపికారణకార్యభావం।

ఉక్త్వాపురాపరిణతి ప్రతిపాదనేన।
సంప్రత్యపోహతి వికారమృషాసిద్ధ్యై॥

భావము : అధరభూమి నధిరోహించిగాని ఇతరాన్ని, అనగా ఉన్నతమగు మరియొక భూమిని అధిరోహించుటకు వీలుపడదు. శాస్త్రముకూడా కారణ కార్యభావాన్ని ప్రతిపాదించుచు మొదట చెప్పిన వికారవాదమునకు మృషాత్వసిద్ధిని కలుగజేయుటకు పరిణామవాద ప్రతిపాదనను సాధనముగ చేయుచున్నది. అధరభూమి=క్రిందిస్థాయిది.

కారిక 61

వివర్తవాదస్యహిపూర్వభూమిః।
వేదాన్తవాదేపరిణామవాదః।
వ్యవస్థితేస్మిన్ పరిణామవాదే।
స్వయంసమాయాతి వివర్తవాదః॥

భావము : వేదాన్తశాస్త్రములో వివర్తవాదానికి పూర్వభూమిగ పరిణామవాదము పేర్కొనబడుచునేయున్నది. పరిణామవాదం సుప్రతిష్ఠితమైతే వివర్తవాదం స్వయంగానే సుసిద్ధముకాగలదు.

కారిక 62

ఉపాయమాతిష్ఠతి పూర్వముచ్చై।
రుపేయమాప్తుం జనతాయథైవ।
శ్రుతిర్మునీంద్రశ్చవివర్తసిద్ధ్యై।
వికారవాదం వదతస్తథైవ॥

భావము : జనసమూహము సమున్నతమైన లక్ష్యాన్ని సాధించుకొనటానికి మొట్టమొదట ఒకానొక ఉపాయమునవలంభించుచున్నది. అట్లే శ్రుతియు బాదరాయణమునీంద్రుడును వివర్తవాద సంసిద్ధికోసము తొలిఉపాయముగా వికారవాదాన్ని చెప్పియున్నారు.

తాత్పర్యము : ఈ జగత్తుయొక్క సృష్టివిషయములో సనాతన భారతీయ ఆధ్యాత్మిక వైజ్ఞానికులలో నాలుగు ముఖ్యమైన ప్రక్రియలుగలవు. అవి ఆరంభ, సంహతి, వికార, వివర్త వాదములు. శ్రీ వేదవ్యాసముని వీనియందు వికార వివర్త వాదములను మాత్రమే సంగ్రహించి ఆరంభ సంహతి వాదములను పరిహరించెను. ఆరంభ వాదమనగా వస్త్రమునేయుటకు ప్రారంభముదారములతో జరుగునట్లు ఈ జగత్తుయొక్క సృష్టి అణువులతో ప్రారంభమగునని భావము. This is the theory of Atomism.

సంహతి : అణువులు ముద్దగానేర్పడుట. ఈ ముద్దవలన సృష్టిలో ఒక ద్రవ్యము ఏర్పడునని చెప్పువాదము. This is the theory of mono-dology. వికారవాదమనగా పరిణామవాదమే. అణువులు కేవలం సంహతములగుటచాలదు. ఈ ముద్ధ పరిణమించినగాని సృష్టికార్యము జరుగదనిచెప్పుట.

ఇక వివర్తవాదమనగా భ్రాంతి జ్ఞానమువలన ఒక వస్తువు మరొక వస్తువువలె గోచరించుటయే. ఈమారురూపంవస్తువుయొక్క సృష్టికికారణ మని; అంటే పరిణామము జరుగకయే మారురూపము గోచరించుట. ఉ|| తాడుయొక్క పదార్థమునందు పరిణామము జరుగకయే పామువలె గోచరించుట. ఈజగత్తుకూడాఅట్లేపుట్టినట్లు కనిపించుటమేగాని యదార్థముగ పుట్టనేలేదనుట. కనుక తత్త్వవిచారణ చేయుచున్న ఈ మనమున్నుపుట్టనే లేదనుట. కారణబ్రహ్మ పదార్థమునందు మార్పుజరుగదని నిర్ధారించుచే వివర్త వాద లక్ష్యము. అంటే వాస్తవముగానిసృష్టిని వివర్తసృష్టి అంటారు.

వేదవ్యాసులవారు పరమార్థమునకై వివర్తవాదమును ప్రతిపాదించి యున్నను, లోకవ్యవహారమునందలి యజ్ఞయాగాది శాస్త్రీయకర్మలకుగాని,

కృషి, వాణిజ్య, ప్రజాపాలనాదులగు లౌకికకర్మలనుద్దేశించి—ఉపష్టంభముగా నుండవలెనంటే మాయామిథ్యాత్వ వాదమనెడి వివర్తవాదమపకరించదు గనుక పరిణామవాదమును కూడా పూర్వరంగమున అనివార్యముగనెంచి ఆమోదించిరి.

కనుక పరిణామవాదము వ్యవస్థితమైతే వివర్తవాదము స్వయముగనే సువ్యక్తముకాగలదని భావించిరి. అనగా ఉపేయమగు వివర్తవాదమునకు ఉపాయముగ పరిణామవాదము పరిగ్రహింపబడినది. ఇప్పటికి వాదభేదముల గుర్తెరింగితిమి. ఇక అందలి వివేకమును పొందయత్నింతము.

1. ఆవిష్కరణ వాదము : వివృతం బ్రహ్మజగద్రూపేణ ఇతి వివర్తం అను సూక్తి వివరణ సందర్భమున చర్చింపబడినది.

2. ఆరంభవాదము : ఇది కాణాదతార్కికులు ప్రసక్తము చేయువాదమే. కానీ శంకరులు దీనిని విరసించెను.

ఇందు పరిమాణువులు తమంతతామే సంకలనము పొందుటచే పదార్థముగ రూపొంది జగత్తునిర్మాణము పొందుటయే ప్రధానప్రక్రియ. ఈ కార్యము జడమగు పరమాణువులకెట్లు సాధ్యపడునన—అది అదృష్టము వల్లనని సమాధానమునిత్తురు. ఈ వివరణ స్వారస్యమును సమకూర్పనందున త్రోసివేయబడెను. ఐనను ఆధునిక విజ్ఞానశాస్త్రములు ఎలక్ట్రానుల యందలి వ్యష్టిప్రవృత్తికిని, వాని సమష్టియందు సామూహికప్రభావముచే ప్రాప్తించు ప్రవృత్తికిని భేదమును నిర్ధారించి వ్యష్టియందలి గోచరించని శక్తి సమష్టియందు ప్రభవించననువగునని ప్రయోగములచే గ్రహించి ప్రవచించియున్నందున ఈ అదృష్టసిద్ధాంతమునందును స్వారస్యమున్నట్లే భౌతికశాస్త్ర విజ్ఞానము విశదముజేయుచున్నది.

3. సంహతివాదము : సంహతియన ముద్దకట్టుకొనిపోవుట. బాహ్యము లైన భౌతిక పరమాణు వులను, మానసికములైన కామక్రోధాదులను సంహత ములైన (పరస్పరం సమ్మిశ్రితములై) ఈ జగత్తుగా మిరిణమించును అని ఈ వాద తాత్పర్యము. ఇది బౌద్ధదార్శనికులచే ప్రతిపాదింపబడియున్నది. ఇది సర్వజనాంగీకారముగాకయున్నందున, వ్యవహారమునందు నమసి పోయెను.

4. పరిణామవాదము : Theory of transmutation. శ్రీ కపిలా చార్యుని సాంఖ్యదర్శనమునందలి మూలసిద్ధాంతము.

ఈ వాదమునందు పురుషుని (జీవశక్తి) సాన్నిధ్యమువలన జడపదార్థము ప్రభావితమై జగద్రూపమున పరిణమించుననుటయే మౌలిక సిద్ధాంతము. ఇందలి ప్రక్రియ సులభగ్రాహ్యముగనుండుటచే సర్వజనాంగీ కారమైరాణించు చున్నది. పరిణామవాదమును తాత్త్వికులు ఉపాయ మాత్రముగ గ్రహించి అది ఉపేయమగు (లక్ష్యమగు) వివర్తవాదమునకు పూర్వభూమికయందలిదనియు అది లక్ష్యసిద్ధికి సాధనముగ మాత్రము పకరించుననియు తెలుపుదురు. ఉపాయమన సాధనములేక ఉపకరణము. ఉపేయమన-సాధించవలసిన లక్ష్యము. ఇరువది నాలుగు తత్త్వములుగల ప్రకృతి జగన్నిర్మాణమునకెట్లుపకరించునో ఆ విధానమును దెలుపు వాదముగనుక బోధనాసౌలభ్యము నుద్దేశించి శంకరుడు దీనిని వివర్తమునకు పూర్వభూమికయందలి సిద్ధాంతముగ అంగీకరించెను (కారిక 61) ఇదియెట్లు సముచితమన—ద్రవ్యము తమోగుణ ప్రాధాన్యముగలది.

కనుక స్థూలరూప పదార్థమునందు ఘటించుపరిణామము ఇంద్రియ జ్ఞానగోచరమగుట కవకాశమున్నది. కానీ రజోగుణ ప్రాధాన్యముగల

తైజసపదార్థరూపములు తైజసదృక్కులకు మాత్రమే గోచరింపగలవు. ఇది వ్యష్టివిషయమున విరాట్ స్థాయియు, సమష్టివిషయమున హిరణ్యగర్భ స్థాయియుఅగును. కనుక పరిణత మనస్కులకు మాత్రము అవగాహనకు అనుకూలించును. అందుచేసాధకులకువలయు సామాన్యజ్ఞానమునకుపకరించునది పరిణామప్రక్రియయు జ్ఞానసిద్ధులకు మాత్రము తనకుతానై సూక్ష్మ రూప రహస్యముల ప్రకటించునది వివర్త ప్రక్రియయునై యున్నది.

కనుక పరిణామ ప్రక్రియయందు తన్మాత్రలస్థాయివరకు పోయి గ్రహింపగలవారలకు వివర్త ప్రక్రియ సిద్ధవస్తువేయగును. తన్మాత్రల స్థాయియన భూతపూర్వరూపస్థితి The prematerial state of matter.

ఈ విచారణకు తాత్పర్యమేమన :— పరిణామ వాదము ప్రాపంచిక దృష్టితో వస్తురూపమును విచారించుట కుపకరించును. అనగా తమోగుణ ప్రధానమై ప్రభవించిన పదార్థయొక్క విశ్లేషణకు పకరింప, వివర్తవాదము శుద్ధసత్వముగ సిద్ధమైన అంతఃకరణదృష్టితో — రజోగుణ సంబంధియైన సూక్ష్మతైజస పదార్థవివేకము పొందుటకు పకరించును. పరిణామము గుణ పరిణామమనియు వివర్త పరిణామమనియు రెండువిధములుగా చెప్పబడినది.

అధిష్ఠానపదార్థమునందు మార్పొకలుగని ప్రక్రియయగు వివర్తము నకు పరిణామమను పదప్రయోగమెట్లు సమంజసమో సుబోధకముగాలేదు. పరిణామము స్థూలమునందలిది అనగా విరాట్ స్థాయియందు జరుగు మార్పులకు సంబంధించినది. రెండవదగు వివర్తము— సూక్ష్మదేశము నందలి సంభవమగు విధానప్రదర్శకమునై యున్నది— అనగా హిరణ్యగర్భ స్థాయిలో జరుగు విధానప్రదర్శకక్రమము. వివర్తమను పదమునకు— కేవలము నీఅజ్ఞానమువలననే లేనివస్తువు ఉన్నట్లుగాగోచరించుట అను

అర్థమనుట సముచితముగాదు ఇచట పరిణమించునది జగత్తుకుసంబంధించిన పధార్థముగాదు; అజ్ఞానమే.

ఏలనన రజోగుణముయొక్క విక్షేపశక్తి తమోగుణముయొక్క ఆవరణశక్తి అనునీరెండుభావముల ప్రభావప్రసరణయే అజ్ఞానమనినేను గ్రహించగలిగినది. జ్ఞానముయొక్క అభావమే అజ్ఞానమనిగాదు. అజ్ఞాన రూపమున పరిణమించునది గుణపరిణామమే.

## స్వీయ స్వాతంత్ర భావములు

గుణములన సత్వరజస్తమోగుణములనబడు పదార్థచరమరూప లేశములు. They are the univalent elemental ultimates but not qualities or attributes. They belong to matter Catigorised into three varieties according to the properties they exhibit. వీటి సంకలనమువలన పదార్థము రూపొందుటయే గుణ పరిణామప్రక్రియకు లక్ష్యము. కనుక ఇది రాశికిసంబంధించినది. ఇట్టి పదార్థముల కొలిమిలోకాల్చి సుత్తెలతో మోదియు, కర్రయగునెడల రంపముతో కోశి ఆ ముక్కలను జిగురుతో అంటించిగాని, మనకు ఇష్టమగు రూపముల కల్పించుకొన నవకాశమున్నది. రసాయనిక మార్పులగల్పించి పాలను పెరుగగునట్లు చేయవచ్చును. వివర్తప్రక్రియతో కల్పింపబడిన భావరూప దృశ్యములు (Illusions) అట్లు చేయసాధ్యముగాదుగదా!

కనుక మొదటిది స్థూలమునందుగలుగు పరిణామ విధానమును దెలుపుచుండ రెండవది సూక్ష్మదేశమునందలి శక్తి పదార్థవిభూతి ప్రదర్శకముగ నుపకరించును.

పదార్థమునకు స్పందన ప్రధాన లక్షణము. No matter can exist with out motion. ఈ స్పందన వలననే పదార్థమునందు నిర్మాణాత్మక,విచ్ఛిన్నకర, శక్తులుద్భూతమై వృద్ధిక్షయములకునామరూపము లకును కారణమగుచున్నవి. ఇదియే పరిణామప్రక్రియలకు ప్రయోజనము. ఇందు సూక్ష్మపంచభూతములు వాటివిభజన, తిరిగి పంచీకరణము చేయ బడుట అందుచే స్థూలపంచభూతములు నిర్మాణమగుట పదార్థము రూపొందుటయు జరుగును. ఈ పదార్థము రాశిరూపమైనది గనుక దీనిని ఛేదించుట దహించుట మున్నగు కార్యములచే సహజపరిణామముచే సంభవమైన పదార్థములకు మన ఇచ్చవచ్చిన రూపముల కల్పించవచ్చును, కనుక ఇది దృగ్గోచరమైనట్టిది.

<u>వివర్త పరిణామము :</u> ఇది వేదాన్తదర్శనమునకు సంబంధించినట్టిది. నిర్గుణపరబ్రహ్మము సగుణేశ్వరరూపమున వివర్తమగుట అది వివర్తము. మరల సగుణేశ్వరుడు రామకృష్ణా ద్యవతారములతో వివర్తమగుట వైవర్తమందురు—అనగా వివర్తముయొక్క వివర్తమని భావము. సగుణ బ్రహ్మయే జగత్తుగ సూక్ష్మరూపమున ప్రకటమగుటయే మన పరిశీలనకు విషయమగు వివర్తక్రియ.

ఈ వివర్త పరిణామము చిత్తమునకు సంబంధించినది. చిత్తము నందు వృత్తిభేదములుదప్ప రాశియనునదిలేదు. చిత్తవృత్తులచేతితో తాక బడజాలవు. కత్తులతో ఛేదించిగాని అగ్నియందు దహించిగాని రూపాంతర ముల కల్పింపలేము. తాడు పాముగతోచునట్లు భ్రమజ్ఞానము గలుగ వచ్చునుగాని, తాడుపామే అయి రాశిగ రూపొందుట సంభవముకాదుగదా.

మరి అజ్ఞానవశమున ప్రమాత్మ వివర్తముచే సంభవమగు ఈ జగత్తంతయు రాశిరూపమునగోచరించుచున్నదిగదా! The cause for an illusion is in the mind. It is mentation derailed or railed along a different wrong route, where as the cause for appearences is in the Combination of atoms and molecules. వివర్తవాదమున-జీవాశ్రిత మాయాప్రభావముచేతనే భ్రాంతిజ్ఞానము సంజనితమై భౌతికముగలేని దృశ్యమును మూర్తిమంతముగనున్నట్లు ప్రదర్శించుటయని గ్రాహ్యమగు చున్నది. కానీ ఈ జగత్తునందలి పదార్థములు భౌతికములుగనున్నవిగదా! ఇవి స్పర్శకు దృక్కు-కుఅందుచు పంచేంద్రియశక్తులచే గ్రహింపబడు చున్నవి; వ్యావహారిక సత్యములని అంగీకరింపబడుచున్నవి.

మరి భ్రాంతిజన్యములు మాత్రమేననుటెట్లుపొసగును ? అను శంకకు సమాధానముగను, భ్రాంతిజన్యపదార్థపుటునికిని సమర్థించుటకును వేదాన్త శాస్త్రమున స్వప్నావస్థకు ప్రముఖస్థానము కల్పింపబడినది. స్వప్నజగత్తు రాశిలేకయే ఉన్నట్లుగనే తెలియబడుచున్నది. మేడలు మిద్దెలు రాశిలేకయే దృశ్యమానమగునట్లు ఈ జగత్తున్ను రాశిలేకున్నను, ఉన్నట్లుభాసించునని భావించమందురు. వ్యక్తికి జాగ్రత్తు కలుగగనే స్వప్నజగత్తు నశించును! కాని రాశి రూపమగు యీ జగత్తు మాత్రము నశించి అదృశ్యమగుటలేదే. అది ఎట్లన పరిణతజ్ఞానమను జాగ్రత్ కలిగినప్పుడు ఈ జగత్తుకూడా స్వప్నజగత్తువలె నాశనమవునందురు. అయితే భూమిపైనున్న అందరకు ఈ జగత్తు ప్రత్యక్షముగ ఉన్నట్టిదే అయివుండి ఒక జ్ఞానికిమాత్రము నామ రూపములు లేకుండపోవుటెట్లు? ఎట్లన నీవు జీవన్ముక్తుడవు-కనుక యీ కనిపించేవి అన్నీ ఉన్నాలేనివేనని భావించుకొనుమనుట ఒకటే నిర్ద్వంద్వ ఏకైకమార్గము.

8)

స్థూలముగ ప్రత్యక్షమగుచున్నను ఇది నిత్యసత్యముకాదు అను భావము కలుగుటవలన, జ్ఞానికిమాత్రము ఈ విషమసత్తయందు బ్రహ్మ గోచరించుటవల్లనేనందురు. దీనివలన వివర్తము అను పదమునకు భ్రాంతి జ్ఞాన సంజనితమైన, రాశిరహితమైన, కేవలం దృశ్యమానముమాత్రమే అయిన జగత్తు అని విశ్వాసము కలుగుచున్నదా? కనుక ఇల్యూషన్ అను ఆంగ్లపదమునకుగల 'భ్రాంతి జ్ఞానసంజనిత మిథ్యా ప్రపంచము' ను అర్థము వివర్తప్రక్రియకు అన్వయింపనగునా ? లేక వివర్తమన—ఒక పరిణతజ్ఞాని హిరణ్యగర్భస్థాయియందలి పదార్థమును సూక్ష్మమగు తైజస దృష్టితో నవలోకించినపుడు ప్రకటమగు సగుణ బ్రహ్మ విభూతియని భావించనగునా? ఇవి భూమికాభేదములుగ గ్రహింపనగునని నా విశ్వాసము.

నేను చెప్పదలచినది రెండుమాటలలో చెప్పమందురా ? జగత్తు ఇల్యూషన్‌కాదు. ఏలనన ఇల్యూషన్ (భ్రాంతిజ్ఞానము) వల్ల సంభవమైన జగత్తుకు ప్రకృతి శక్తులుండ వీలులేదు. అగ్నిపర్వతముల ప్రజ్వలనము సంభవము గాజాలదు. మర్రి విత్తనమునందు వటమహీరుహము పుట్టి పెంపొందజాలదు. ఇట్లు ప్రకృతియొక్క ఏ శక్తియు ప్రవృద్ధమై ప్రకాశింపజాలదు. అందుచే భ్రాంతిజన్యజ్ఞానము నామరూపములతో అభివ్యక్తమై లోక వ్యవహారము ప్రవర్తింపనవకాశము లేదు. జగత్తు పదార్థముయొక్క మార్పు అస్థిరతలకు వర్తించుటచేతనే మిథ్య (Impermanence) అను పదము అనువర్తనీయమగును.

పదార్థము పంచభూతాత్మకము. పదార్థముచేతనే నవగ్రహములు, నక్షత్ర మండలములు నిర్మాణమగుచున్నవి. నవగ్రహముల ప్రభావము ఒకని జీవితమునే మలుపులుదిప్పి మార్పులపొందింప సమర్థమైయున్నది. ఈ గ్రహములకు ఛాయాచిత్రములను కూడ సిద్ధముజేసి నక్షత్రవేధశాలయందు (Planaterium) ప్రదర్శించు చున్నారు. కనుక యీ సృష్టి

మిధ్య (Changing and there fore impermanent) అననోప్పును గాని భ్రాంతిజ్ఞాన సంజనితమనుటయందౌచిత్యములేదు. జీవదృష్టికీసృష్టి, పదార్థపరిణామమే. దివ్యదృష్టికి హిరణ్యగర్భస్థాయియందు సంభవమగు మార్పులమర్మముల వివృతము (వికసించుట) జేయుటయే. ఇదియేసాక్షి వివర్తము. ఇది కైవల్యమునకు పూర్వరూపస్థాయి.

ఆదిశక్తియగు విశ్వమాతృ విభూతిని ప్రస్ఫుటించుచు— వివర్తస్థాయినతిక్రమించి కేవలస్థాయి కధిగమింప సహకరించు జ్ఞానదీపకళిక ఈ వివర్తభావము. ఒకమతానుసారము నీవునేను పుట్టనేలేదనుకొను స్థితిలో అసలు అధిగమనమునకులక్ష్యము, అధిగమనమనుక్రియ, అధిగమించే వాడూ ఒకడుఉండేగదా భ్రాంతిజ్ఞానమనో, సూక్ష్మజ్ఞానమనో, శుద్ధ జ్ఞానమనో అనుకోవటానికి? విన్నారుగదా బ్రహ్మయణం! ఇదే— వివర్త వివేకగంభీరగాథ! బ్రహ్మయ్యయగు రామునకు, జగత్తనబడుజానకికి బంధుత్వమెట్టిదో ఇప్పుడు చెప్పండి. ఈ బాంధవ్యము గ్రహించినవారు లోకకల్యాణమునకే కార్యకర్తలుకాగలరు—ముక్తులునుకాగలరు.

## వివర్త వివేక ప్రయోగము

ఈ వివర్తవాదమునకు ప్రయోజనమెట్టిదనిన శాఙ్కరాద్వైత వాదమును అవగాహనతో గ్రహించుటకు ఈవాదమే పటిష్ఠమైన సాధనము. కనుక వివర్తవాదమునను వర్తింపజేయుచు, జీవబ్రహ్మలకు ఐక్యభావమును దెలుపు అద్వైతసిద్ధాంతమును అవగాహన జేసికొననుపకరించును.

శాఙ్కరాద్వైతము ఒకే వాక్యముతో "బ్రహ్మసత్యం—జగన్మిధ్యా" అని చెప్పబడుచున్నది. ఈసత్యమును వివరించుటకు మాయావాదముగ ప్రసక్తమగుచున్న వివర్తవాదమును సాధనముగ గ్రహించిరి. అగుటచే

ఇది ఒకవాక్యమేగాని, ఇందలిభావములను విశ్వసనీయముగ గ్రహించుటకు ప్రస్థాన గ్రంథములనేగాక, కపిల సాంఖ్యాది దర్శనశాస్త్రములను చదువుటయేగాక, అష్టాంగసాధనయు అనివార్యము అత్యంతావశ్యకమును నై యున్నదను సత్యమును గుర్తుంచుకొనవలయును ఈ వాక్యమును జ్ఞాన మార్గములలో కొందరు అంగీకరింపరు బ్రహ్మసత్యమని తెలిసికొనుటకు నిత్యానిత్యవస్తువివేకమును గురువేదాన్తవాక్యశ్రవణముతో ప్రస్థానత్రయ విషయ వివేకములుపొంది బ్రహ్మవిషయమున చెప్పబడుతటస్థలక్షణములు, స్వరూపలక్షణముల వివేకమునుపొంది, యోగసాధనతో స్వరూపలక్షణముల అనుభూతికి ఆయత్తముగావలయును. గీతలో చెప్పబడిన "మమసాధర్మ్య మాగతాః" అను వాక్యలక్ష్యమిదియే పదార్థము విషయమున—సత్త్వ రజస్తమస్సులు, లక్షణములబట్టి ఎట్లు వర్గీకరింపబడినవో ఆవర్గత్రయము నకు అంతఃకరణముపై గల ప్రభావమెట్లు పరిణమించి ప్రభవించునో; పదార్థమునకు నిర్మాణము. విచ్ఛిత్తి, ఎట్లుప్రాప్తించి వస్తువులురూపొందుచు నశించుచున్నవో గ్రహించినగానీ కూటస్థబ్రహ్మకు జీవధర్మములెట్లు ప్రాప్తించినవో, వాటిని త్రోసిపుచ్చినయెడల తన సహజబ్రాహ్మీస్థితినెట్లు గుర్తించుకొనగలదో తెలియబడదు.

వివర్తవాదము మాయావాదముగ వ్యవహారమునకు వచ్చియున్నది. కానీ ఈ రెంటినీ ఓక్కటిగనే గ్రహింపననువుగాదని నాకు తోచుచున్నది. ఏమన 'మాయ' అనుపదముచే ప్రకృతి తెలియబడుచున్నది. మంత్రము: "మాయాంతుప్రకృతింవిద్ధిమాయినంతు మహేశ్వరం" (శ్వేతాశ్వ) ఇందలి భావము—మాయను ప్రకృతిగా తెలిసికొనుము. ఆమాయను తనస్వాధీనము నందుంచుకొనువాడు మహేశ్వరుడు అని గ్రహింపుము. ప్రకృతి త్రిగు ణాత్మకము. కనుక మాయ, త్రిగుణాత్మకమగు ప్రకృతియేగావలయును, కనుక తాఃరూపమున నుండవలయును; Maya Should pertain to

mass, అల్లుగాక మాయశక్తియే అందురా—ఆ శక్తి చిత్శక్తి జడశక్తి రూపములు దాల్చువరకును ఈ సృష్టికి అవకాశములేదు. మాయకుకూటము, వంచన, నిజముగానిది, అని అర్థములు చెప్పుకొని సరిపెట్టుకొనవచ్చును గాని, త్రిగుణములను పదార్థలేశములుగ పరిగణించిన, సూటియగు అర్థము రాశికే అన్వయించును. వివర్తమన్ననో—మనసుకు సంబంధించినది. అనగా భావరూపమైనది. ఈ ప్రక్రియలో పదార్థమునందుగాక చిత్తమునందే పరివర్తనము ప్రాప్తించుట గణనీయముగ గమనీయము. రజస్తమస్సులచే ప్రభావితమైయున్న మనస్సు, సాధనచే శుద్ధసత్వ ప్రధానమైయున్నతరి, తననిజస్వరూపమునే సంభావింపగలదు. పరిణామప్రక్రియలో తెలియబడు ఉపాదానమునందు మార్పులు సంభవించుచున్నందున వస్తువు నిత్యసత్యము గాదని వస్తువుయొక్క అనిత్యత్వము (Impermanence) తెలియబడు చుండ—వివర్తప్రక్రియయందు వస్తువుయొక్క మూలతత్త్వ స్వరూప స్వభావములే (The thing as it is in its nature) సంభావ్యములు, దర్శనీయములునగు చున్నవి. కనుక జగత్తుయొక్క వివర్త విధానము జ్ఞానులకు మాత్రమే సంభావ్యము సందర్శనీయమును. సందర్శనీయమన-జగత్తుయొక్క వివర్తమును దర్శింపగలవాడు కేవలము సాక్షిమాత్రుడే యగును. ఇపుడు మాత్రమే అధిష్ఠానమునందెట్టిమార్పును జరుగకయే దానియందు జగత్తుఎట్లు అధ్యారోపమగు చున్నదో సుగ్రాహ్యముకాగలదు. పరిణామవాదికి అధిష్ఠానము తెలియబడక అధ్యారోపిత పదార్థము మాత్రమే తెలియబడును. ఉ॥ ఒక పూవునందలి వర్ణములు, వాసనలు సామాన్యునకు మనోరంజకమగు లక్షణములుగ మాత్రమే తెలియబడుచుండ అవియే ఒక సైంటిస్టుకు వర్ణములు వాసనలుగాక ఎలక్ట్రానులుగ మాత్రమే తెలియ బడును. ఇవియే స్థూలసూక్ష్మశరీరములయందలి భేదభావములు. ఇవియే విరాట్ హిరణ్యగర్భస్థాయిలులేక స్థూలసూక్ష్మజగత్తులు.

ఇట్లు పరిణామ వివర్తవాదముల జ్ఞానము భౌతికపారమార్థికరూప (తత్త్వములకు) దృష్టిభేదములవలన ప్రాప్తించు భిన్నస్వరూపములదెలుపు. భౌతికపారమార్థికములకు వారధిగ సహకరించును. ద్రష్టయొక్క దృక్కోణమునుబట్టి కేవలచర్మచక్షుదృష్టికి పరిణామ ప్రక్రియగను. వస్తుతత్త్వ పరిశీలనజేయువారికి పరమేశ్వర స్వరూపముగను తెలియుచున్నది. జగత్తున దృష్టిభేదానుసారము రాముడు తనకెట్లు భాసించెనో ఆంజనేయుడు చెప్పినది వినండి:—

శ్లో॥ దేహబుద్ధ్యాస్మిదాసోఽహం జీవబుద్ధ్యాత్వదంశకః
ఆత్మబుద్ధ్యాత్వమేవాహం ఇతిమేనిశ్చితామతిః ॥

భావము : ఇందు, ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతభావములు మూడును పేర్కొనబడినవి. 1. శరీరమేనేను అను దేహాత్మబుద్ధితో చూచిన నీకునేను దాసుడను. 2. జీవుడే నేను అనుభావముతో జూచిన నేను నీయొక్క అంశామాత్రుడను. కానీ, 3. ఆత్మబుద్ధితో (పారమార్థికదృష్టితో) చూచిన నీవేనేను—నేనేనీవు అనగా రాముడునుగాదు. ఆంజనేయుడునుగాదు— ఉన్నది బ్రహ్మపదార్థమొక్కటే. ఇది నానిశ్చితాభిప్రాయము. ఇందు భిన్న భావములకు భిన్నరూపములు తెలియబడవచ్చునుగాని, ఒక సమ్యక్ దృష్టి యున్నది.ఇది వస్తుతత్త్వదర్శనమును గల్పింప కళాప్రపూర్ణ శ్రీకొండూరు వీరరాఘవాచార్యులవారి శిల్పదర్శనమను గ్రంథమున ప్రసరింపబడినవెలుగు. సర్వమునకును సమరస భావదాయకమగుసమ్యగ్దృష్టియున్నది ఉదాహరింతును వినండి :

జీవశక్తియుక్తమగునొక బీజమును తీసికొని — ఆదిదేనినుండి ప్రభవించినదని పర్యాలోచనచేయగా జీవశక్తిచే పరివ్యాప్తమైయున్న ఒక కాండమునుండియని తెలియబడును. ఈ కాండముదేని నుండి పుట్టినదని విచారించిన చైతన్యశక్తియుక్తమగు ఒక బీజమునుండియని తెలియగలము. కాండములేనిదే బీజమురాదు, బీజములేనిదేకాండమురాదు అంటే చైతన్య

శక్తి లేనిదే జీవశక్తి కలుగదు. జీవశక్తి కలుగనిదే చైతన్యమునకు స్ఫూర్తి కలుగదు. కానీ చైతన్యముచే పరివ్యాప్తమైయుండని బీజముగానీ కాండము గానీ ఒకటిమరొకదానిని ప్రభవింపచేయజాలవు. కనుక బీజకాండములు రెండును ఒకే పదార్థము యొక్క రెండంశలుగ పర్యవసించుచున్నవి. వీటి యందు జాలువారుచైతన్య శక్తి చేతనే బీజముకాండము రెండును రూపొందు చు ఒకదానికొకటి కారణముగ స్ఫూర్తినిచ్చుచున్నవి. ఐనను సామాన్య దృష్టికి కాండము జడముగను బీజముచైతన్యముగను తెలియబడుచున్నవి. ఇట్టి బీజాంకురన్యాయము పరిణామక్రియను మాత్రము దెలుపును. కానీ ఇందలి నిజకారణము చైతన్యము మాత్రమేనని జీవరసాయన శాస్త్రజ్ఞానము గల తత్త్వవేత్తలకు మాత్రమే తెలియబడును. ఈ జీవ రసాయన విజ్ఞానము, తత్త్వవిజ్ఞానము, రెండును "జ్ఞానంతేఽహంసవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః" (గీ-7-2) నందు బోధింపబడినవి. సవిజ్ఞానమనగా స్వానుభవపూర్వక జ్ఞానముగాని, కేవల శాస్త్రార్థ్యయనాదికముగాదు, అని సుస్పష్టము జేయబడినది.

ఇట్లు జగత్తుసామాన్య దృష్టికి జడముగను పరిణమించుచు నామ రూపములుగ ప్రకాశించునని తెలియబడుచుండగా-జీవరసాయన శాస్త్రవేత్త యగు తాత్త్వికునకుగల రెండుఅంశలుమాత్రమే బీజకాండములు రెండును ఒకే భావమునకు గలరెండు అంశలు మాత్రమేననియు బీజకాండముల ప్రవృత్తికికేవల చైతన్యమే కారణమనియును సుగ్రాహ్యమగును. ఈ ఉదా హరణముండి గ్రహింపవలసిన సూత్రమేమన:—

1. బీజాంకురములయందు సంభవమగు మార్పులు అధిష్ఠానమగు చైతన్య పదార్థమునందు కలుగుచుండవనియు,

2. ఈ అధిష్ఠానమందే విలీనమైయున్న ప్రకృతియే బీజశక్తి సాన్నిధ్యముచే

క్రియమాణమై బీజములు కాండములను వాటికార్యములను, నామరూప ములుగ సంభవింపజేయునని ఈ నామరూపములనే మనము మన అల్ప దృష్టివలన అధిష్ఠానమునందధ్యారోపము జేయుచున్నామని తెలిసికొనుటయే వివర్త ప్రక్రియకు గుప్తవివేకమైయున్నది అంతియేగాని అజ్ఞానమువలన లేనిదైనట్టి ప్రపంచము రాశిరూపముననీముందు ప్రత్యక్షమగుచున్నదన్న మాత్రముగాదు. (ఇది నా స్వంత అభిప్రాయము, హేతువాదపూర్వకము.) శాస్త్రమునందు నిష్ణాతులైనవారికి మాత్రము కేవలం అజ్ఞానమొక్కటియే జగత్కారణముగావచ్చును, అది ప్రమాణవచనముగా వచ్చును. కాని అజ్ఞానమును నేను గ్రహించిన స్వరూపముతో వివరించి తత్కార్యవిధాన ముపై కొంతవెలుగు ప్రసరింపితిని, జడదృష్టితో కాండమును జూచిన పరిణామమున్ను చిదాభాస-చైతన్య దృష్టితో బీజమును పరిశీలించిన బ్రహ్మ వివర్తమున్ను తెలియబడును. అహంకార సంజనిత దేహాత్మబుద్ధికి జీవధర్మములుంటచే పరిణామమే పరిగణనకురాగా వస్తుతత్త్వవివేకము గల దృష్టికి వివర్తవివేకమే ప్రాప్తించును. కనుక కారణము కార్యము నందు పరివ్యాప్తమైయుండి సృష్టికార్యమును ప్రదర్శించునపుడు కారణ దృష్టి వివర్తభావ సూచకముగను కార్యదృష్టి పరిణామ సూచకముగను వర్తించును. కనుక కార్యకారణముల కనన్యత్వమున్నదను సిద్ధాంతము పరిణామ వివర్తవాదములకు తాత్పర్యము. అందుచేతనే పరిణామవాదము వివర్తవాదమునకు ముందలిస్థాయి విషయముగ దాని ప్రయోజనమును శ్రీ శంకరులంగీకరించుట జరిగినది.

వివర్తమువలన స్థూలసూక్ష్మములకు అవినాభావసంబంధమే సిద్ధమై యున్నది. రెండుమ అద్వయ మిధున భావముతో (The indivisible Spouse) నుండుననుభావమే వివర్త ప్రక్రియాబోధకము "పాదోస్యవిశ్వా

భూతాని త్రిపాదస్యామృతం దివి" (పు.సూ) అను మంత్రభావమును పరిశీలించి అవగాహన జేసికొనువారికి తెలియబడుభావమే మన—పరబ్రహ్మ పదార్థము మూడుపాదముల మేరకు ఉండగా ఒక పాదభాగము మేరకు మాత్రము లయస్థితియందో ప్రవృత్తియందోయున్నట్టి విశ్వములు భూతములు అందు భాసించుననియే. పాదభాగమన ఏదో ఒక అంశ (Fraction) మేరకని గ్రహించవలయును. ఈ రెంటిసమష్టియే 'పూర్ణము' అను పదము తెలుపు భావము. పై విషయముల సమీక్షించిన తెలియబడునదేమన—జీవదృష్టితో పరిశీలించిన ఎడల వివర్తమను ప్రక్రియ ప్రమాతకేవర్తించును. ప్రమాత యన—అంతఃకరణమునందు ప్రతిబింబిత మైన ప్రత్యక్ చైతన్యమే.

అధ్యాసభాష్యమునందు ప్రతిపాదింపబడిన 'అవిద్య'యను భావము ఈ ప్రతిఫలించిన ప్రత్యక్చైతన్యమునకు మాత్రమే వర్తించును. అన్వయింపననువగును. ఈ సూక్ష్మము గ్రహించినవారికి మాత్రమే తత్త్వశాస్త్రబోధలు సుగ్రాహ్యములగును. ఏలనన — ప్రత్యక్చైతన్యమునకు ప్రాప్తించిన అధ్యాసను వివర్తింపజేయుటమాత్రమే తత్త్వశాస్త్రలక్ష్యమై ప్రవర్తించుచున్నది. ఇది గుర్తుంచుకొనవలసిన గణనీయ విషయము. ప్రమాతయొక్క మానసికపరిణామమే ప్రమాతృ వివర్తము అనబడు చున్నది. Thissort of Vivartha is a figment of the mental ego. అనగా వస్తుతత్త్వజ్ఞానము లభింపకయే, ఇంద్రియగోచరమగు వ్యతూవ స్వభావములనే సత్యమని భావించి, అట్టి మృషాజ్ఞానమునాధారముగజేసి కొనియే బ్రహ్మ స్వరూపమును వివరింపబూనుట. బ్రహ్మముయొక్క సహజధర్మముల సంభావింపలేకపోవుటయే అసంభావన. ఆయనకులేని ధర్మములనారోపించి అవి ఉన్నట్లుగనే నిర్ణయించి నిర్ధారింపబూనుటయే విపరీతభావన. ఇందుననే ఇది పరతంత్రాధ్యాసమనబడును; అనగా ప్రమాతచే

బ్రహ్మమునందారోపింపబడినవని భావము. ఈ అసంభావన విపరీతభావనలే ప్రమాతృ వివర్తలక్షణములు.

సాక్షి : ప్రమాత పరిచ్ఛిన్నభావముతో పరిగణింపబడుచున్నందున ఈతని ప్రవృత్తినవలోకించు తత్త్వమొకటిస్ఫురించును. అదియేసాక్షి. సాక్షియన తనముందు సంభవమగుచున్న ఒకసన్నివేశము నవలోకించి చూచినదాని నొక న్యాయవిర్ణేతకు నివేదించువాడను సామాన్యవ్యావహారిక భావముగాదు. సాక్షికి అంతఃకరణమొక ఉపకరణమైనప్పుడే ప్రమాతయొక్క ప్రవృత్తిని చిత్తవృత్తులను అవలోకింపగలడు. కనుక నీతడు 'కేవలదృక్' కాకున్నను, హిరణ్యగర్భస్థాయియందలి తత్త్వమై (a Spiritual entity) ప్రమాత యొక్క ప్రవృత్తిని నిర్లిప్తముగ జూచుచుండు వాడని గ్రహింపనగును. This silent spectator is the one who passively perceives the doer and his pleasures and pains, without being touched by those. ఈ సందర్భములో నీ క్రింది ఉపనిషద్వాక్య భావమును అవగాహనజేసికొనండి.

"ద్వాసుపర్ణాసయుజా సఖాయాసమానం వృక్షం పరిషస్వజాయతే తయోరన్యంపిప్పలం స్వాద్వ త్త్యనశ్నన్నన్యో౽భిచాకశీతి (ముండక-3-1)

భావము : రెండుపక్షులొక వృక్షశాఖలపై కూర్చునియున్నవి. అందొకటి ఆ వృక్ష ఫలములను రుచిచూచుచున్నది. రెండవపక్షికి కర్తృత్వభోక్తృత్వ ములు లేకయే జరుగుచున్న కార్యములను ఊరకచూచుచుకూర్చున్నందున సాక్షియనబడుచున్నది. ఈ మంత్రము ప్రపంచ విషయములను అలం కారికముగ పేర్కొన్నది. ఎట్లన—ఆ వృక్షము ప్రకృతియని ఆ రెండు పక్షులు జీవేశ్వరులనియు, ఆ చెట్టు ఫలములతిని రుచులననుభవించునది (కర్మలజేయుచు ఫలములననుభవించేది) జీవుడనియు, ఏమియుచేయక ఊరకచూచుచున్నపక్షి కర్మఫలదాతయగు ఈశ్వరుడనియు, ఇతడు సాక్షి

మాత్రుడనియు చెప్పబడినది. కనుక ఈ ప్రకృతికి అంటుబడియున్నది జీవుడనియు, కర్తృత్వభోక్తృత్వములులేకయే నిర్లిప్తముగ నున్నవాడు ఈశ్వర చైత్యమనియు తెలియబడుచున్నది.

త్రిగుణప్రభావమునకు లోనుగాకఆత్మస్వీయప్రతిభచే హిరణ్యగర్భుని స్థాయియందు జరుగుకార్యములను సాక్షిమాత్రుడుగ నవలోకించుచుంటయే సాక్షి పదమునకు తాత్పర్యము. హిరణ్యగర్భుడన తైజసదృష్టికి తెలియబడు బ్రహ్మస్వరూపము. సగుణబ్రహ్మము తనకుతానై స్వతంత్రముగ జగద్రూపమున ప్రకటమగుటచే ఇది స్వతంత్రాధ్యారోపములేక అహృతాధ్యాసమనియు అహృతాధ్యారోపమనియు పరిభాషింతురు. 'వివృతంబ్రహ్మజగద్రూపేణ ఇతి వివర్తమ్' అను సూక్తియొక్క భావమే సాక్షి వివర్తము. పరబ్రహ్మము సర్వసాక్షి : ఈతడికి అంతఃకరణమను పరికరము ఆవశ్యకము గాదు. ఈతడి జ్ఞానోపలబ్ధిఎట్టిదన—

శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ (గీ-13-14)

అను శ్లోకమున జెప్పబడినట్లు ఏకాదశములగు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియమగు మనస్సుల కలిగియుండకున్నను, నిర్గుణుడయ్యును—సర్వమును దర్శించగలవాడు. ఈతని సాక్షిత్వమెట్టిదన—తన ముందు జరుగుచున్న ఒక సన్నివేశమును నిర్లిప్తముగ నవలోకించి, చూచిన విషయమును ఒక న్యాయనిర్ణేతకు చెప్పవచ్చినవాడను భావముగాదు. తానే దృక్కు తానే దృశ్యముగ (a Being having both the subjective and objective aspects) తన ఆత్మయందు తానేరమించు కేవల జ్ఞాన స్వరూపుడని మాత్రము తెలియబడుచున్నది. కుమారసంభవములో కాళిదాసు చెప్పినట్లు "ఆత్మానమాత్మన్యవలోకయంతం" అంటే తన స్వరూపమునందే

తన ఆత్మను దర్శించు ఆనందమును పొందువాడని మాత్రమే భావముగాని, సాక్ష్యము చెప్పవచ్చినవాడని మాత్రముగాదు. ఈ భావమునే తత్త్వవేత్త యగు Kant తనమాటలతో 'The transcendental Unity of apperception' అని చెప్పియున్నాడు. ఈ భావము కర్మఫలకారకుడగు ఈశ్వరుని సాక్షిత్వభావమువంటిదిగాదు. పరబ్రహ్మజ్ఞానపూర్ణుడనియు జడతత్త్వము గాదనియు నిర్ధారించుటకే 'సాక్షి' యని పరిభాషింపబడినాడు.

ఈ చర్చయందలి గ్రాహ్యాంశము లెవ్వియన :—

1. స్వతంత్ర వివర్తమున పరమాత్మకు ప్రతికూలవేదన లేశమైనను ఉండదు. అనగా సుఖదుఃఖములు, శుభాఽశుభములు మున్నగుద్వంద్వాను భూతులు ఆయనకు కలుగవు. అస్థాయి, నర్తకునిస్థాయివంటిది. అనగా ఒకనటుడు దుఃఖమును ప్రదర్శించునప్పుడు అదుఃఖభావప్రదర్శనయందు తన ప్రతిభను ఆనందించుచునేయుండును. అది సర్వద్వంద్వములకు సాక్షియగు స్థితిగనుక ఆయనయందెట్టి మార్పును సంభవముగాదు.

2. అవిద్యాశబలితమైన జీవావస్థయందు మాత్రమే ద్వంద్వము లన్నియు సంభవమై అనుభూతినిచ్చు చుండుటచే అదియనొక స్వప్నావస్థ వంటిదేవందురు. ఈ మానవపరిస్థితినే ప్రమాతృ వివర్తమందురు.

3. అహ్భూతాజ్ఞానము, అహ్భూతాధ్యాసము, అహ్భూతాధ్యారోపము, అహ్భూతవివర్తము, స్వతంత్రవివర్తము, అహార్యాధ్యాస, ఈశ్వరాధ్యాస, అనునవి సాక్షివివర్తమునకు పర్యాయ పదములు మాత్రమే.

సాక్షివివర్త స్వరూపవివేకమునిచ్చు శ్లోకము యోగవాశిష్ఠము నుండి పేర్కొనుచున్నాను వినండి :—

శ్లో॥ శాపవ్యాజవశాదేవ రాజవేషధరోహరిః ।
ఆహృతాఽజ్ఞా సంపన్నః కించిజ్ఞోఽసౌభవత్ప్రభుః॥

భావము : శ్రీహరి ఆహృతాజ్ఞానముతో శ్రీరామావతారుడై కించిజ్ఞునివలె వ్యవహరించెను అని. This is the idea of acquired super imposition. కనుకనే శ్రీరాముడు మాయామానుష విగ్రహుడు.

శ్రీకృష్ణుడన్ననో లీలామానుష విగ్రహుడు : అనగా రామునివలె గాక తన పరబ్రహ్మతత్వమును పూర్తిగా ప్రకటించెను. అనగా వివృతము జేసెను. కృష్ణుడు తానేపరబ్రహ్మమునని ప్రత్యక్షముగా జెప్పుట గీతా పాఠకులందరకు సువిదితమే। ఈయనకు గురువేదాన్తవాక్య శ్రద్ధాశ్రవణములు లేకుండగనే స్వస్వరూపాను భూతిపొందియుండుట చేతనే తన పరబ్రహ్మత్వము తనకు సుస్పష్టమే అయియుండి ఇతరులకు ఉపదేశించెను. This is selfevident super imposition. సామాన్య జీవుల విషయమున-వారికి నరజన్మవచ్చి ఈశ్వరధ్యాన ఆరాధనలవల్ల చిత్త పరిపాకము పొందిననేగాని వీరికి సాక్షీ వివర్త జ్ఞానము కలుగదు.

శ్లో॥ లో కేస్మిన్ద్వి ధానిష్ఠాపురాప్రోక్తామయా నఘా ।
జ్ఞానయోగేనసాంఖ్యానాం కర్మయోగేనయోగినామ్ (గీ-౩-౩)

వివరణ : అద్వైత బ్రహ్మవిచారణ చేయువారికి పలయువిషయందు రెండు ప్రక్రియలు నిర్దేశించి చెప్పబడినవి. అవి కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ అను విధానములు. ఇందు సాంఖ్యులకు (జ్ఞానులకు) సద్గురూపదేశపూర్వకమగు శ్రవణ మనననిదిధ్యానములు నిష్ఠగా నాదేశింపబడినవి. కర్మనిష్ఠయన శ్రుతి స్మృతులచే విధింపబడు నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానమనియు భావము. ఇందు కర్మనిష్ఠ నాచరించువారికి (గృహస్థవానప్రస్థులకు) పరిణామప్రక్రియ

యనునొక విజ్ఞానవిధానము నిర్దేశింపబడినది. జ్ఞాననిష్ఠ సన్న్యాసులకు సూచింపబడినది. జ్ఞాననిష్ఠయందు వివర్తమునకు ప్రాధాన్యతగలదు.

కర్మనిష్ఠద్వైతభావపరముగనున్నది. ముందు ఈ సృష్టికి ఒక సృష్టికర్తను సంభావింపవలయును. ఆతనికి పూజలు, ఆరాధనలు, జరుపుచు ఉపాసనలు జేయుచుండవలయును; ఈ క్రియవలన చిత్తశుద్ధిగలుగుచు జ్ఞాననిష్ఠకర్హతగలుగును. పిమ్మట అద్వైత భావసిద్ధికి అనగా తురీయాతీతమగు పరబ్రహ్మముతో సాధర్మ్యమునొంద సహకరించునని విశ్వసింపనగును. ఈ విధముగా అద్వైత సిద్ధికలుగుటకు ఈ ద్వైతనిష్ఠ ఒక సాధనముగ జెప్పబడినది.

శ్లో॥ అద్వైతంసిద్ధిరిత్యేవద్వైతం సాధనమాహయః।
శ్రీపరబ్రహ్మతీర్థాఖ్యస్తం నమామిగురోర్గురుమ్॥(ప్రజ్ఞానందయోగి)

భావము : అద్వైతసిద్ధి అనగా స్వస్వరూప అనుభూతి. ఇదియే తురీయాతీతమగు పరబ్రహ్మము. ఈ స్థితిని పొందుటకు ద్వైతనిష్ఠ ఒక సాధనముగ మాత్రముపకరించును. ఈ సూక్తిని చెప్పిన పరబ్రహ్మతీర్థులను గురుదేవునికి నమస్కరించుచున్నాను.

ఒకశంక : సిద్ధియన స్వస్వరూపానుభూతి. ఇది పరిపూర్ణభావము. ఇది అనాది సిద్ధముగనుండ—సాధనలతో దీనిని సృజించుకొనుటెట్లు పొసగునను శంకను కొందరు ప్రస్ఫుటించుచున్నారు. ఈ శంకను నివారించుకొనుటకు "లోకేస్మిన్ ద్వివిధానిష్ఠాపురాప్రోక్తామయానఘా" అను శ్లోకభావమును మననము జేయుటావశ్యకమైయున్నది కర్మయోగసాధనలు ఆ సిద్ధవస్త్వానుభూతిని పొందుటకు సంభవమగు నవరోధముల తొలగించుకొనుటకు మాత్రమేననియు దానిని సృజించుటకు మాత్రము కాదనియు గుర్తుంచు

కొనసలయును. ఇందొక సూక్ష్మవిషయ వివరణను గ్రహించవలెను. ద్వైత సాధనలు రెండు విధములు.

i నిరంకుశ ద్వైతము (the absolute duality) అనగా మనకు లక్ష్యమగు సిద్ధినే ద్వైతభావముతో గ్రహించుట. ఎట్లన ముందొక విశ్వాతీతమూర్తిని (an extra Cosmic God) సంభావించి ఆయనతో సాలోక్య సారూప సామీప్యములనాకాంక్షించి ఈ స్థితులనే సిద్ధియని విశ్వసించుట.

ii రెండవది 'అనుయోగి ద్వైతము' అనగా a tentative duaility Conducive to the revelation and realisation of the state of Perfection, which is, The Unity Consciousness. ఇందలి ద్వైతభావ పూర్వక సాధనలు (నిత్యనైమిత్తికములు, ఉపాసనాదులు, పూజలు ఆరాధనలు మున్నగునవి) చిత్తశుద్ధిని కలిగించగా దివ్యతత్త్వము స్వయంప్రకాశముతో ప్రకటమగుటయు సాధకునికి దివ్యత్వానుభూతి గలిగి సాయుజ్యము ప్రాప్తించుటయే సిద్ధి. ఉదాహరణకు సృష్టిజన్మతో లభించినది. పిమ్మట సంభవమైన శుక్లముల (అజ్ఞానమును) తొలగించుటకు జేయు శస్త్రచికిత్సలవంటివే ఈ ద్వైతభావసాధనలు. ఇదే అనుయోగి సాధన. ఇది లేనియడల కర్మనిష్ఠ ప్రసక్తముగాదు. కనుక జీవదృష్టి దివ్యదృష్టి అనువాటిని విశ్లేషించి గుణదోషముల గ్రహించిననేగాని, శుద్ధ వస్తువగు పరబ్రహ్మమును పొందుటయేగాని, సృజించుటెట్లు సాధ్యమను శంకతొలగదు. ఆంతర్యమును సామాన్యులు సంభావింపజాలరు. గనుక అట్టివారికి బ్రహ్మసత్యం, జగన్మిథ్య ఈ జగత్తు సత్యముగా ఉన్నట్టిదేననియు ఇది పరమేశ్వర మాయాపరిణామమువల్ల ప్రాప్తించుననియు ఒక ప్రాథమిక బోధతో ఉపక్రమించి పిమ్మట ఈశ్వరధ్యాన ఆరాధనలవలనను నిష్కామ కర్మాచరణములవలనను చిత్తపరిపాకముపొంది పిమ్మట జ్ఞాననిష్ఠకుగడంగ

వలయుననియు, ఆకస్మిక జ్ఞాననిష్ఠ ఆచరణసాధ్యముగాదనియు బోధించెను. ఈ భావమును ఈ క్రింది సూత్రము ధృవపరచుచున్నది.

"తదనన్యత్వం ఆరంభణ శబ్దాదిభ్యః॥ (బ్ర-సూ-అ2-పా1-అధి6-సూ14)

ఈ సూత్రమునకు భాష్యపంక్తులయందలి భావమేమన—అవిద్యతో కూడిన అంతఃకరణదృష్టికి ఈ కార్యప్రపంచమంతయును సత్యమైనదిగనే తోచును అట్టివారు సగుణేశ్వరుని ధ్యానఆరాధనలను ఆచరించుచునే నిర్గుణస్థాయి కధిగమింపసాధనల జేయుచుండవలెను. కనుకనే ఇట్టివారికి శాస్త్రము పరిణామప్రక్రియను నిర్దేశించినది.

ఈ చర్చకు ప్రయోజనము : స్థూలమునకును సూక్ష్మమునకునుగల భేదమును గ్రహించుటయే గాహ్యాంశము.

1. స్థూలపదార్థమగు రాశి (mass) యందలిమార్పులు దెలుపునది పరిణామము.

2. సూక్ష్మపదార్థమందలి మార్పుల గోచరింపజేయునది వివర్తము. వివృతము జేయుట, వికసింపజేయుట. అనుఉత్కృష్టభావదృష్టియందు వర్తించును. ప్రమాతయగు జీవుని దృష్టియందు వివర్తమన భ్రాంతిజన్య మిథ్యాజ్ఞానము వల్ల కలిగిన దృశ్యమే.

3. పరిణామము మార్పులతో గూడినదిగనుక దాని ఉపాదానము నిత్యసత్య పదార్థముగాదు.

4. వివర్తము సూక్ష్మమునందలి ప్రవృత్తిని గోచరింపజేయునది గనుక పరిణామము ప్రమాతకు వర్తింప వివర్తము సాక్షికిమాత్రమే గోచరమగును. అప్పుడు "బ్రహ్మైవ జగత్" అను భావము స్ఫురించి "వివృతర బ్రహ్మ జగద్రూపేణ ఇతివివర్తం అనుభావమాధూథమగును.

5. పరిణామమునందుగల అనిత్యత్వమును దెలుపునట్టిది వివర్తము. అనగా కార్యము అనిత్యము కారణము నిత్యసత్యమనియే.

6. వివర్తమునకు పరిణామమను పదమును అను సంధించి వివర్త పరిణామమనుట సమంజసముగాదు లేదా అవిద్యయందలి తమోగుణాంశయు సాక్షిచైతన్యమునందలి సత్వగుణాంశయు పరిణమించునని భావించ వలయును. Illusion అను పదము, దృశ్యమునకుగాక, భ్రాంత చిత్తమునకు మాత్రమే వర్తించును. భ్రాంతిచే సంజనితమగునది ద్వైతభావము అనగా జీవేశ్వరులు భిన్నతత్వములని మాత్రమేగాని, జగత్తుఅనిగాదు. ఇదియే గ్రాహ్యాంశము.

ఎక్స్‌రేల సహాయముతో ఒకని ఉరస్సును తెరపై స్క్రీనింగుచేసి చూచినయెడల సజీవుడై యున్న ఆ మానవుని గుండె కొట్టుకొనుట, ఊపిరితిత్తులు శ్వాసక్రియ జరుపుట, ఆ స్క్రీనింగ్‌లో ప్రత్యక్షముగ చూడగలము. ఇది వివర్త భావబోధకమగు ఉపమానము. దీనినిబట్టి జగత్తు చర్మచక్షుస్సునకును, జ్ఞానచక్షుస్సునకును ఎట్లు భిన్నముగ గోచరింపగలదో బోధపడును.

ఒకే అర్థముగల రెండుపదములను త్రిగుణవిజ్ఞానముతో వివేచించినచే—అరూఢమగు అర్థము అవగాహనకాగలదని సంభావించి చదువరులకు హిరణ్యగర్భ స్థాయియందలి సూక్ష్మదృశ్యములకుగల ప్రయోజనమును ఎక్స్‌రే స్క్రీనింగుతో పోల్చివివర్తవాదహృదయమును నా జీవధర్మానుసారముగ వివరింప యత్నించితిని. ఆమోదింతురేనిధన్యోస్మి యను కొందును.

# భావప్రాప్తిక సూత్రములు

జగన్నిర్మాణమును గురించి సంక్షేపశారీరకమునందలి 57 to 61 కారికల పరిశీలించి భిన్నభిన్న వాదముల గ్రహించి యుంటిమి. అందలి భావములను పరిపుష్టముజేయ సహకరించు కొన్ని సూత్రములనుకూడా గ్రహింతము.

అద్వైత బ్రహ్మవాదమున పరిణామవివర్తములు :—

"భోక్త్రాపత్తేః అవిభాగశ్చేత్, స్యాత్‌లోకవత్" 13

(2వ-అ, 1వ-పా. 5వఅధి6వ, అధికరణములు బ్ర॥సూ॥)

భాష్యము : లోకే ప్రసిద్ధోఽయంభోక్తృ భోగవిభాగః॥

పరమార్థాభిప్రాయేణతు 'తదనన్యత్వమితివక్ష్యతి॥

తాత్పర్యము : ఈ సూత్రమున జగద్బ్రహ్మలకు పరిణామ ప్రక్రియ ననుసరించి భేదమునే వివక్షించినారు. ఇట్టిభేదదృష్టికి స్థానముకలిగించని యెడల సగుణేశ్వరుని ధ్యానఆరాధనలకు సముచితస్థావము కలుగజాలదు. కాగా పరమార్థదృష్ట్యా "తదనన్యత్వమారంభణ శబ్దాదిభ్యః" అనుసూత్రమున వివర్తప్రక్రియ ననుసరించి జగత్తుకు బ్రహ్మకును భేదమును నిరసించి తెలిపియున్నాడు. ఎట్లన-కేవలం వాచారంభణమేగాని వికారములు వాటి నామములున్ను వేరుగాలేవు. ఉ॥ మృత్తుకన్నను మృణ్మయ పాత్రలువేరుగా యుండనట్లు ప్రకృతి పరమాత్మకరణను భిన్నముగానిదైనను, ప్రమాత యొక్క బుద్ధికివేరై యున్నట్లే తెలియబడునుగదా ! ఇందుచేతవేదాన్త సిద్ధాంతమునగల పరిణామ వివర్తములను రెండుప్రక్రియలున్ను—వాటికి వర్తించు ఈ రెండు సూత్రములు ఒకదానివెంట మరొకటి పేర్కొనబడి యున్నవి.

పరిణామ ప్రక్రియకు దృష్టాంతముగ సముద్రము అందలితరంగము లకు వస్తుదృష్ట్యా అభేదమే సిద్ధమైయున్నను, వ్యావహారికదృష్ట్యా భేద మున్నట్లే పరిగణింపబడుచున్నదిగదా! ఇట్లే జగద్బ్రహ్మలకు కూడా వ్యావహారికమున భేదమున్నట్లే మనము పరిగణించవలసియున్నదిగాని పరమార్థతః మాత్రము అభేదమునే అంగీకరింపవలయును.

తాత్పర్యమేమన : కార్యకారణములకు వ్యవహారమునందుగల సంబంధము పరిణామమనియు, పారమార్థిక దృష్టితో తెలియబడు సంబంధము వివర్త ప్రక్రియయనియు పేర్లు. సూత్రప్రాయముగ చెప్పుకుంటే పరిణామవివర్త ప్రక్రియలకు భేదభావము దృష్టిభేదముచేత మాత్రమేగాని వస్తుతఃకాదు.

ఇక 13వ సూత్రమునకు వెనువెంటనే చెప్పబడిన 14వ సూత్రమును పరిశీలింతము.

"తదనన్యత్వం ఆరంభణశబ్దాదిభ్యః" 14

భాష్యము : కార్యం ఆకాశాదికం బహుప్రపంచం జగత్ ।
కారణం పరబ్రహ్మ ।
తస్మాత్కారణాత్పరమార్థతో అనన్యత్వం వ్యతిరేకేణ
అభావః కార్యస్య అవగమ్యతే ।
కుతః? వస్తువృత్తేన వికారో నామ నకశ్చిదస్తి ।
వికారఃనామధేయమాత్రః అనృతః ।
యథాచమృగతృష్ణికోదకానాం ఊషరాదిభ్యో అనన్యత్వం
దృష్టనష్ట స్వరూపత్వాత్ స్వరూపేణ అనుపాఖ్యత్వాత్,
ఏవమస్య ప్రపంచజాతస్యబ్రహ్మవ్యతిరేకేణ అభావః ఇతి
ద్రష్టవ్యమ్॥

తాత్పర్యము : పరబ్రహ్మమునకును ప్రపంచమునకును కార్యకారణ భావ సంబంధమైయున్నది. కారణము బ్రహ్మము కార్యము ప్రపంచము. దృష్ట నష్ట స్వరూపముగల అనగా పుట్టుచునశించుచుండు స్వభావముగల కార్యమునకు నామమాత్రాస్తిత్వమేగాని వాస్తవమైన ఉనికి ఉండదుగదా! కారణము యొక్క ఉనికియే కార్యమునందు గూడా భాసించును. కనుక కారణమే వస్తువు. అది సత్యమైనది. కార్యము మిధ్యయే, ఎండమావు లందలి నీటికి వాస్తవమైన ఉనికిలేదుగదా! ఎండమావులు ఊషర ప్రదేశమున మాత్రము భాసించును. ఈ ఊషరముయొక్క ఉనికియే ఈ మానవునకుకూడా ఉనికి యగు చున్నది. అంతకంటెను వేరుఆధారము తెలియబడుటలేదుగదా! కనుక బ్రహ్మ, ప్రపంచముల విషయమున, బ్రహ్మమునకంటె అతిరిక్తమైన భావము ప్రపంచమునకు లేదని మనము తెలుసుకొనవలయును. ఇట్టి ఆ భాసమైన ఉనికికే 'వివర్త ప్రతీభాసమని పేరు. ఇది ప్రమాతృ వివర్త సంబంధి.

పై వివరణలో "కారణముయొక్క ఉనికియే కార్యమునందు కూడ భాసించును" అను వాక్యమును నిశితముగ విశ్లేషించి వివేచించగా నా అల్ప బుద్ధికి ఇది పరిణామ ప్రక్రియలో తెలియనగు సమసత్తగా స్ఫురించు చున్నదిగానీ వివర్తమునకు సంబంధించిన విషమసత్తగా తెలియబడుటలేదు. కనుక ఈ ఉపమానమెట్లు వర్తింపగలదాయను సందియము గలుగుచున్నది. ఇది భేద నిరాసయేగాని ఏకత్వప్రతిపాదనగాదని వాచస్పతి మిశ్రుని వ్యాఖ్య.

గమనిక : సంక్షేపశారీరక గ్రంథపు 2వ అధ్యాయమునందలి ముందు మనము గ్రహించియున్న భావములను బ్రహ్మసూత్ర ద్వితీయాధ్యాయ ప్రథమ పాదమందలి 'భోక్త్రాపత్తి' మరియు 'ఆరంభణ' అధికరణముల యందు పేర్కొనబడిన భావములతో పుష్టిని సముపార్జించు కొనవనగును.

ఇంకను మిరొక సూత్ర భావము :—

సూత్రం :- "మృత్తికేత్యేవసత్యమ్" జీవేశ్వర జగత్ అనేడి త్రిపుటి వై చిత్ర్యమంతయును బ్రహ్మాధిష్ఠానమునందు కల్పితమైన వివర్తమాత్రమై వదేగాన-లేనట్టిదే. శారీరకుడైన జీవాభాసుడు వాస్తవమునకు పరబ్రహ్మమే నను విచారణగావించెడి శాస్త్రముగనుక బ్రహ్మసూత్రములకు 'శారీరక మీమాంస' అనెడు పేరుగలిగెను.

ఈ దృక్పథముతో పరిశీలించినయెడల జీవులయొక్క సంసారబంధము కూడ వాస్తవమైనదిగాదనియు కనుక మోక్షమనునదికూడా వివర్తభూత మైనదేననియు, శ్రీ గౌడ పాదాచార్యుని మాండూక్యకారిక కూడా ఇట్లు ప్రబోధించుచున్నది.

"ననిరోధోనచోత్పత్తిః। నబద్ధోనచసాధకః।
నముముక్షుర్నవై ముక్తః। ఇత్యేషాపరమార్థతః॥

భావము : ఈ జగత్తునందు గోచరించెడి ఉత్పత్తి నాశనములుగాని, బద్ధులు, సాధకులుగాని, ఈద్వంద్వములేవియును పారమార్థికముగలేవు.
మరొక్క-సూత్రమున్ను గ్రహింపదగియున్నది:

సూత్రం : 'ఈక్షతేర్నాశబ్దమ్'

భాష్యము : 'సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవఅద్వితీయమ్।
తదైక్షతబహుస్యాంప్రజాయేయేతి' ఇతిశ్రుతౌ।
'ఇదం'శబ్దవాచ్యం నామరూపవ్యాకృతం జగత్ప్రాగుత్పత్తేః
సదాత్మనాఽవధార్యతస్యైవ ప్రకృతస్య సచ్ఛబ్దవాచ్యస్య
ఈక్షణపూర్వకం తేజః। ప్రభృతేఃస్రష్టృత్వం దర్శయతి॥

<u>తాత్పర్యము</u> : ఈ సృష్టికి పూర్వము, కేవలచైతన్యమగు సత్పదార్థము మాత్రముండెను. దానికే పరబ్రహ్మయను నామము వ్యవహారమునందు పరిభాషింపబడుచున్నది. అదియే సర్వాత్మయగు ఏకాత్మ (the Unity Consciousness). అది అనంతము. నిరపేక్షమునగు ప్రజ్ఞయే. అదియే నిర్గుణ కారణబ్రహ్మము. దీనివివర్తమే విశ్వాత్మ (the Cosmic Consciousness) లేక సగుణ కార్యబ్రహ్మము.

The cosmic consiousness is the stupendous thought content of all creatures down from the ant to the Universal Divine father Prajapathi. This Universal mind is the self super imposition or auto configuration of the original Budha Mukta Kevala Chaitanyam. The auto mentation of the original silent awareness is audivivartam or the initial Vibration which took place in the Nucleus Cosmic, which is of the nature of ideation and diversity (i.e.) the ideation of Swagatha Bhedam, Audi Chaitanya or the unity consciousness is of the nature of contentless silent awareness. The desire of the being for becoming is known as Tadha Bubhoosha. Now we get the two principles "Sat" or Being and the "becoming" or Asat, by Vivartha, of course, without even a tinge of change.

This much about the topic of Vivartha, which, I had endeavoured for comprehension in its entire scope. May the Almighty grant me comprehension to perfection in this life itself, for which I shall further endeavour, seeking the Divine Grace and blessings from my readers.

# ఉపసంహారము

శ్రీ అరవిందులు—బ్రహ్మ, జగత్తు అను భావముల విషయమున, రెండును ఏకకాలముననే సాపేక్షికములనియు, సగుణనిర్గుణ స్వరూపములనియు, సక్రియ నిష్క్రియములనియు బోధించినట్లు ఆయన గ్రంధముల ముఖమున నేను గ్రహించిన విధానమైయున్నది. ఇందలి తత్త్వసారము "బ్రహ్మ - జగత్తు" రెండును ఒకే సత్యమునందలిగల రెండు సహయోగి అంశలుగ నిర్ణయించుటయేగాని అవి ప్రతియోగులని ఎచ్చటను పేర్కొన్నట్లు తెలియబడలేదు. కార్యబ్రహ్మయందిది అనువర్తనీయమే.

శంకరులు జగత్తునవనవోన్మేషముగ నున్నది గనుక నిత్యసత్యము మాత్రముగాదని తెలిపెనుగాని జగత్తు అసలులేనిదేనని చెప్పలేదు. కొందరు జగతుమారుచుండు స్వభావముగలిగి యున్నందున నిత్యసత్యమైనదిగాక పోయినను— ఉపాదానపదార్థము మాత్రము మార్పుల బొందుచున్నను నిత్యమైనట్టిదేనని చెప్పుచున్నారు. కనుక మార్పులతోకూడిన ఉపాదాన పదార్థము నిత్యమును, ఆ మార్పులకు కారణభూతమగు చైతన్యము నిత్య సత్యమును అగుచున్నది. ఇదిలోగత మనము వివేచించి గ్రహించిన కాండము. బీజము, బీజశక్తి వంటివి. ఇదే అద్వయమిధున భావము (Idea of the indivisible spouse). కనుక బ్రహ్మయే జగద్రూపమున వివృతమయ్యెనసుట (ప్రస్ఫుటమయ్యెనసుట) అనాది సిద్ధసత్యము. కానీ పదార్థముయొక్క నిజస్వరూపమును గ్రహించిన విజ్ఞాన సంపన్నునకు మాత్రము ఇందలి ప్రక్రియచే వివర్తము సుజ్ఞానమును ప్రభవించును. అన్యులకు ఇది గుణపరిణామము మాత్రమే యగును. ఇదే స్వగత భేదము. అనగా శక్తిని పరిగణించిన యడల పరిణామ ప్రక్రియయు,

బ్రహ్మను పరిగణించి పరిశీలించినయడల సాక్షి వివర్తముగను తెలియ బడుటయే ఈ చర్చయందలి తత్త్వసారము.

తాత్పర్యము : విరుద్ధ స్వభావములు గలిగియుంటచే రెండుగ తెలియబడు ప్రభావములు ఏకైక తత్త్వమునందే గర్భితమని తెలియబడుట కవకాశ మున్నందున పరిణామ సాక్షివివర్తభావములు తెలియబడుచున్నవిగాని సత్పదార్థము మాత్రము ఏకైకమే. కైవల్యమే. ఇదే పూర్ణభావము. ఇందుచే శ్రీ అరవిందులు జగత్తుకూడా సత్యమనియు, శంకరులు అదిమిథ్య యనియు చెప్పినను స్వగతభేదసిద్ధాంతము ఈ రెంటిని సామరస్యమును సమకూర్చువారధిగ నుపకరించి 'ఏకమేవ అద్వితీయం బ్రహ్మ' యను విశ్వ యాత్మక జ్ఞానమును ప్రాప్తింపజేయగలదీ వివర్తవాద వివేకమని విశ్వ సించుచున్నాను.

విన్నారుగదా విషయము ! ఇదియే బ్రహ్మాయణము. గ్రహించారా? ఓంకార స్వరూపిణి, వాగ్రూపిణియగు జగత్తను జానకికిపి సచ్చిదానంద స్వరూప బ్రహ్మప్రతినిధియగు రామునికినిగల అనుబంధమెట్టిదో ! అగుచో మీరు లోకకల్యాణమునకు కార్యకర్తలేయగుదురు శుద్ధ బుద్ధముక్తస్వరూపుని సాధర్మములతో సాయుజ్యమును పొందగలరు

పరమహంసాయధీమహి

